# KRISHEEVALA VIJAYAMU

## A

# TELUGU DRAMA

## IN THREE ACTS

BY

**MANTHA SURYANARAYANA, M. Sc.**

Assistant Chemist,

Agricultural Research Institute

COIMBATORE

(Awarded GOLD MEDAL By

GOVT. of MADRAS.)

1935.




అను

మూడంకముల నాటకము



గ్రంథకర్త

మంథా సూర్యనారాయణ, బి. ఎస్.సి (ఆనర్సు), ఎమ్.ఎస్.సి.

[సహాయ వ్యవసాయ రసాయనశాస్త్రి.]

కోయంబుత్తూరు.

**1935**



మంథా సూర్యనారాయణ బి. ఎస్‌సి. (ఆనర్సు), ఎమ్.ఎస్.సి.

# అర్పణము

ఏ సాధ్వీమణి నాదుస్వాంతమునఁ బూ
ర్ణేందుప్రభన్ వెల్గెనో,
యే సాదృశ్యము లేక — కాలగతిచే
విన్నాణినై, వేల్పునై
యేసీమంతిని తారకాగణ సమో
పేతంబు నాకాశమో,
ఆసాధ్వీమణి, "గౌరి" స్మారకముగ
నర్పింతు నీశోత్తమున్.

# PREFACE.

If improved agriculture is the art of raising larger crops and if improved seed can be made to yield more under proper manurial conditions, the main problem of agriculture reduces itself to one of correct feeding of crops. Therefore, in presenting this small drama on agriculture, special importance has been given to the application of organic manures for which a new word [ ప్రాణపోషకములు ] has been coined to catch the public and introduce the idea of "Vitalising constituents", brought out by the work of Viswanath and Suryanarayana*. And in view of the results of soil-surveys and manurial experiments, the importance of these manures for South Indian soils cannot be over-emphasised.

Thus it happens that the remaining ideas including those of rural reconstruction receive mere mention.

As it is realised by experience that a woman character, such as that of a farmer's wife, is difficult to secure at every place and as it is the earnest wish of the author that the drama should be enacted whenever and wherever possible, such a character had to

---

* Memoirs. Dept. Agri, India, Chemical Series Vol.9, No.4, 1927.

be avoided. The materials required for the stage are not difficult to procure at any place.

Although the style chosen for the drama is simple and colloquial Telugu, the songs have been composed with greatest regard to the rules of prosody and accuracy of ideas so that they can better stand the test of time. The metre and tune (మట్లు) for the songs as indicated in the text, are chosen to conform with those of popular ballads, so that they could be easily learnt.

*The Author.*

# తొలి పలుకు
# (FORE WORD)

"కృషీవలవిజయము" అను ఈ చిన్న నాటకమును వ్రాయుటలో మ. రా. రా. మంథా సూర్యనారాయణగారు, తాము నాపరిశోధనశాలయందు చేసిన కృషిని సార్థకము చేసికొనుటకు ఆ పరిశోధనాఫలితములను సులభమైన గ్రామ్య భాషలో, సూటియైన అర్థముతోను, సహజమైన భావముల తోను, చక్కని పాటలతోను రయితునకు అందజేయుబాధ్యత సరిగా నిర్వహించినందుకు అమితానందము నొందుచున్నాను.

నాటకమునందలి ముఖ్యాంశము ఎరువులయొక్క వాడుక, గనుక ఎరువుల తారతమ్యములు అందరి మనస్సుల లోను గట్టిగా నాటునట్లు వేర్వేరువిధములుగా చాటగల్గిరి.

మన చెన్నరాజధానియందలి భూముల సారములను పరిశీలింపగా, వానియందుండు లోపములను సవరించుటకు ముఖ్యమార్గము పశువులయెరువు, పచ్చిరొట్ట, ఎముకలపొడి, గానుగపిండ్లు, తగినపరిమితులలో వేయుటయే. ఈ ఎరువులు వేయగావచ్చిన పంటగింజలలోను, పచ్చిగడ్డియందును ఎక్కువ

విటమినులు (Vitamins) గూడ ఉన్నవన్న మా క్రొత్త పరిశోధనను దృఢపరచు ప్రమాణములు ఖండాంతరశాస్త్రపత్రికలందుగూడ కాననగును.

ఇటువంటియత్నములు సఫలీకృతములై, రయితులు ఆయామార్గముల ననుసరించగల్గుకొలదిని, దేశసౌభాగ్యము పెంపొందుననునది నిర్వివాదాంశము.

స్వర్ణపతకము నందిన గ్రంథకర్తను అభినందించుచున్నాను.

ఇట్లు,

కోయంబత్తూరు, 13-8-34

(Sd.) భా. విశ్వనాథం.
హిందూదేశపు ప్రధానవ్యవసాయరసాయనశాస్త్రి.

# ఉపోద్ఘాతము

ఈగ్రంథమును రచించిన శ్రీ మంథా సూర్యనారాయణపంతులు, ఎమ్. ఎస్. సి, గారు శాస్త్రజ్ఞానమువల్లను, ప్రయోగమువల్లను కృషిశాస్త్ర పరిశోధనలో నైపుణ్యము పొందినవారు; కోయంబుత్తూరులో గవర్నమెంటువారు స్థాపించిన వ్యవసాయకళాశాలకు సంబంధించిన పరిశోధనాలయమున సహాయరసాయనశాస్త్రిగా నియమింపబడినవారు. పాఠశాలలలో ఈవిద్య అభ్యసించడమునకుగాని, గ్రంథములు చదివి జ్ఞానము సంపాదించడమునకుగాని శక్తిలేని పామరులకు తాముచేయ నుద్దేశించిన హితోపదేశము, సులభముగా బోధపడేటట్లు నోటిమాటలతో "నాటక" రూపమున రచించి పంతులుగారు ప్రకటించినారు. పల్లెటూళ్లలో బడిపంతుళ్లు బడిపిల్లలచేత "ఆడించడమునకు" అనుకూలముగా ఉండేటట్లున్ను, ముఖ్యవిషయములు గ్రామ్యజనుల మనస్సులలో నాటుకొనేటట్లున్ను, కృషీవలుల జీవితమున కనురూపమయిన కథ, భూమికలు, సంభాషణలు సరళముగా కల్పించినారు.

భరతుడు మొదలయినవారు నిరూపించిన నాటకలక్షణమును అనుసరించి రచించినది కాదు. గనుక దీనిని 'ఆలక్షణ

మనుష్టి విమర్శించకూడదు. చిన్నపిల్లలకు చిన్నబడులలో అనేక విషయములు సంభాషణరూపముగాను, ప్రశ్నోత్తర రూపముగాను, కథలు కల్పించి బోధించడము సనాతన విధానము గదా. అట్లే నిరక్షరులైన ప్రజలకు చతుర్విధ పురుషార్థసాధన మయిన జ్ఞానము కలిగించడమునకు సంభాషణ రూపముగా రచించిన కథలేకదా, ఇతిహాసములు, పురాణములు అనే పేళ్లతో ప్రఖ్యాతమయి ఉన్నవి. ఏ దేవతను ఎవరు కొలుస్తారో, ఆదేవతమహిమలు వర్ణించి కథలు, వ్రత కల్పాలు, నాటకాలు, పాటలు రచించి ఆ దేవతయెడల అందరికీ భక్తి కలిగేటట్లు ధర్మప్రచారము చేయడము అన్ని దేశములలోను చిరకాలమయి ఆచారముగా ఉన్నది. ఇంగ్లండులో షేక్స్పియరు కాలమునకుపూర్వము 'మిస్టరీ'(Mystery), "మొరాలిటీ" (Morality) అని రెండువిధము లయిన నాటకాలు, యేసుక్రీస్తు బోధించిన ధర్మములు ప్రజలకు అందరికీ తెలియజేయుటకు రచించినారు. ఇవి ప్రబోధచంద్రోదయము వంటివి. పూర్వులు రాజభక్తి, పతిభక్తి, బ్రాహ్మణభక్తి మొదలయిన విషయములు బోధించినట్లే, నేటివారు ప్రజాస్వామ్యము, స్త్రీస్వాతంత్ర్యము, హరిజనుల హక్కులు మొదలయిన విషయములు నాటకములుగా కల్పించి బోధిస్తున్నారు.

ఇట్లే, ఈకాలమందు ప్రజల ఆరోగ్యము అభివృద్ధి పొందుటకు అనుకూలమయిన ఆచారములు (విధానములు)

నెలకొల్పడమునకున్ను, ప్రతికూలమయిన ఆచారములు తొలగించడమునకున్ను, ఆరోగ్యశాస్త్రజ్ఞులు చేస్తూ ఉన్న ప్రచారమునకు సాధకముగా అనేక గ్రంథములు రచిత మవుతున్నవి. వాటిలో సామాన్యప్రజలకు ప్రచరించేవి నాటకాలు, బొమ్మలాటలు, పదాలున్ను. కీ. శే. రావుసాహెబ్ మున్నం శేషాద్రిరెడ్డిగారు రచించిన "శుచి" ప్రఖ్యాతమయినది. ఈ సంవత్సరమే శ్రీమతులు లక్ష్మీశారదలు, "ఆరోగ్యసామ్రాజ్యము" అనేపేరుపెట్టి, "జంగంకథ"వలె పాడదగినట్టి నాటకము, విచిత్రమయినది, రచించి ప్రకటించినారు.

ప్రజలకు ఆవశ్యకమయినవి అన్నవస్త్రములు; ఇవి విపులముగా మనదేశమందు అందరికీ దొరికితేనేగాని, దేశమభివృద్ధిపొందదు. పట్నవాసముకన్న పల్లెలలో శాఖారమే అన్నివిధాలా మంచి దని పెద్దలు నేడు ఉపదేశిస్తున్నారు. "ఖద్దరు" ప్రచారము సర్వవిదితము; ఆవిషయము, నవీన సాహిత్యమందు సర్వతోముఖముగా ఉన్నది. అన్నిటికన్నను ముఖ్యమయినది అన్నము; ఇది కృషివల్లనేగాని మరి ఒక విధాన దొరకదు. అయినా, కృషి, నీచవృత్తిగా ఎంచి, అగ్రవర్ణములవారు నాగలిమీద చేయివేయనందున మనదేశమందు కృషివిద్య వృద్ధిపొందలేదు. "నిజదారసుతోదరపోషణార్థమై, హాలికులైననేమి?" అనే సత్కవులు అరుదు. ఓఢ్ర బ్రాహ్మణులలో కృషి, వృత్తిగా అవలంబించినశాఖవారిని

"హాలి ఆ" లంటారు. వారిని, హీనాలు పుచ్చుకోవడము వృత్తిగాగల శాసన-బ్రాహ్మణులు, "దాను ఆ" లు; తృణీక రిస్తారు. ఒరిస్సాలో దున్నే బ్రాహ్మణులను బలరామ గోత్రము వా రని శ్రోత్రియులు ఆక్షేపిస్తారు.

"ఖిన్నాహం తవ భిక్షయా కురు కృషిమ్" అని పార్వతి శివునితో చెప్పినట్టు ఒకకవి వర్ణించినాడు. అట్టి ఉప దేశము చేసే సతులు ఇప్పుడు కావలెను. ఈకాలమందు కృషి కర్మ గౌరవార్హ మయిన దనిన్నీ, దేశోపకారక మనిన్నీ, బోధించి, చదువుకొన్న వారిని భిక్షుకవృత్తినుండిన్ని, సేవక వృత్తి నుండిన్ని మరల్చి, కృషిలోనికి లాగడమునకు ప్రచారము చేయవలసియున్నది. ఈఉద్యమానికి శ్రీ సూర్య నారాయణపంతులుగారి నాటకము సాధనము.

కథాసారము రెండుమూడుమాటలతో చెప్పవచ్చును. కృషిశాస్త్రజ్ఞులు అనేక ప్రయోగములవల్ల సాధించిన కృషి విధానములు పల్లెటూళ్ళలో గోపరాజు అనే ప్రచారకుడు, ప్రదర్శించి కృషీవలులకు బోధించినాడు. ఒక గ్రామములో ఇతని ఉపదేశముప్రకారము కృషిచేసి, గురప్ప అనే ఒక రయితు కృతకృత్యు డయినాడు. ఆగ్రామములో మరిఒకడు, తమ్మయ్య అనే సంపన్నుడు ప్రాచీనవిధానమునేఅవలంబించి అంతకంతకు ఋణగ్రస్తుడై దీనదశలో ఉండగా, గురప్ప ఉప

దేశముచొప్పున గోపరాజుసంభాషణ వినడము తటస్థించినది. అతడు బోధించిన నూతన విధానము అవలంబించి తమ్మయ్య బాగుపడ్డాడు. నూతన విధానము సర్వోత్కృష్టమయిన దని ప్రత్యక్షప్రమాణమువల్ల ఆగ్రామములోవారికి విశ్వాసము కలిగినది. ఇది "కృషీవల విజయము."

ఇంతకన్న అధికముగా వర్ణించడము ఉపోద్ఘాతములో ఉచితము కాదు. నాటకము చదివి చూడండి. దీనికన్న చక్కనినాటకము ఈవిషయమై కృషీవలులకోసము ఎవరైనా రచిస్తే శ్రీసూర్యనారాయణపంతులుగారు తమ కృషి ఫలించిన దని సంతోషిస్తారు.

పర్లాకిమిడి, ౧-౫-౩౮. } (Sd) గిడుగు వెంకటరామమూర్తి.

---

# పీ ఠి క

తొలుతనుండియు మన దేశమునందు ముఖ్యవృత్తి వ్యవసాయమే అయినప్పటికిని, నేడు జరుగుచున్న కృషివిధానము శాస్త్రరీత్యా పునరుద్ధరింపబడవలసిన స్థితిలో ఉన్నదని అందరికిని తెలిసినవిషయమే. ఈపునరుద్ధరణవిషయమై గ్రంథకర్తయున్ను, ప్రధాన రసాయనశాస్త్రిగా రగు రావు బహదూరు భా. విశ్వనాథంగారును చేసినపరిశోధనలును * వాని ఫలితములును ఈచిన్నినాటకమునందు సూచింపబడినవి.

పంటలు ఎక్కువగా పండించే మార్గములు రెండు. మొదటిది ఎక్కువఫలసాయము నివ్వగల్గు కొత్తరకపువిత్తనములను నాటుట, రెండవది: సరియైన యెరువులు తగిన ప్రమాణములనుబట్టి వాడుట. అయితే ఎంత మంచివిత్తనములయినను ఎక్కువసత్తువగల భూములందు అధికతరమైన ఫలసాయమును ఇచ్చును గనుక, వ్యవసాయాభివృద్ధికి పునాది ఏదనగా సస్యపోషణమే అని తేలును.

హిందూదేశమునం దంతటను, ముఖ్యముగా దక్షిణదేశమునందు చాలాప్రాంతములందలి భూములను రసాయనికముగా పరీక్షింపగా, వాటియందు "కుళ్ళిన పెంట", లేక హ్యూమసు (Humus) అనే పదార్థము మిగుల కొరతపడి

---

* Memoirs, Dept. Agri India Chemical series Vol. IX No. 4, 1927.

యున్నదని నిర్ధారణ చేయబడెను. గనుక ఈ లోపము నివరించుటకు పశువుల ఎరువు, చెత్తచెదారపు టెరువు (Organic Compost), గానుగపిండి, పచ్చిరొట్ట మొదలుగాగల "సేంద్రియపు ఎరువులు" ఎక్కువగా వేయవలెనుగదా.

ఈవిధముగా పశువుల ఎరువుతో పండించిన గింజలలో ఉత్కృష్టమగుశక్తి ఉన్నదనిన్నీ, మిగిలిన యెరువులవల్ల వచ్చెడు పంటగింజలకన్న, ఈగింజలలో ఎక్కువ 'విటమినులు' (Vitamins) అనగా ప్రాణాధారములగు పదార్థములున్నవనిన్నీ ఇటీవలచేయబడిన పరిశోధనలవల్ల తెలినది. గనుక పశుల ఎరువువంటి, 'సేంద్రియపు ఎరువుల'కే, "ప్రాణపుటెరువు"లని ఇంకొక సార్థకనామకరణము చేయబడినది.

గ్రామస్థులు పలువురు కూడుకొనుటకు అవకాశము కల్గు సమయములందు, అనగా సంతలలోను, గ్రామదేవతల ఉత్సవములందును, జాతరలలోను, ఏ నీ, ఈ గురు నటకులైనను సులభముగా ఆడుటకు వీలగునట్లు గ్రామ్యభాషలోనే ఈ నాటకము వ్రాయబడినది. కృషికార్యక్రమమునందలి ముఖ్యసమయములలో అనగా ఊడ్పులలోను, కోతలలోను, కలుపుతీయునప్పుడును, అందరును పాడుటకు అనుకూలమగు మామూళ్ళు మట్లలో పాటలు చేర్చడమైనది.

గ్రంథకర్త.

## ఈనాటకమునందలి పాత్రలు

---

తమ్మయ్య—ఒక ముసలిరయితు

గురప్ప—క్రొత్తసాగు చేసి బాగుపడిన రయితు

గోపరాజు—వ్యవసాయశాఖయందలి ప్రచారకుడు

బలరామమూర్తి పంతులు—వ్యవసాయ శాఖయందలి

డిప్యూటీడైరెక్టరువారు

శంకరశాస్త్రి—గ్రామమునందలి బడిపంతులు

సుబ్బిశెట్టి—వడ్డీవ్యాపారము చేయు వర్తకుడు

తమ్మయ్యకొడుకు, మరి ఇద్దరు.

# కృషీవలవిజయము

---

## ౧-వ అంకము

---

### ౧-వ రంగము

స్థానము : తమ్మయ్య ఇల్లు

(తమ్మయ్య, ఒక కుక్కినులకమంచముమీదకూర్చుండి, విచారించుచుండును.)

త — అయ్యో!

పాట : (రాగము - నాదనామక్రియ)

ఎంతపని చేసితివి రామా - ని
　　　న్నేమ నందును సార్వభౌమా.

హిందు దేశమునందు బుట్టి, కా
　　　ముందుకులమూనందు మెట్టి,
ఈనాటి కీదైన్య మేమీ ?- నే
　　　నేమంటి ? నాపాప మేమీ?　　　ఎంత.

వేసబాసలు లేక భూమీ - నే
నాసపడి దున్నితిని సుమ్మా.
కడుపుకైనను లేకపోయె - మా
కొడుదుడుకు లెక్కువైపోయె. ఎంత.

ఎన్నటికి గతి మాకు, దేవా!, - మ -
మ్మెందైన బోవమన్నావా?
రంగూనో, మోల్మినో పోమా? - వా -
రందుండి తరుమగా రామా? ఎంత.

పంటలను పండించు మాకూ - ఈ
బ్రతుకు బాగ్గులు చేయబోకూ,
మలమలా మాడంగ మేమూ - హా! -
వలవలా యేడ్వంగ లేమూ.

పసులు యెముకలప్రోగు లాయే, మా
పసికూన లేడ్చుచున్నా రే. ఎంత.

ఉసు రెవరు పోసుకోగలరో? - మా -
విసమదశ కెవరు కారకులో?
దేశంపుసౌభాగ్య మింతేనా? - మా -
దీనరక్షకుడవా టింతేనా?. ఎంత.

ఇస్స్! రామా!, [నిట్టూర్పు విడిచి], ఎంత యేడ్చి
మొత్తుకుంటే యేంలాభం? పాపాలన్నీ పండిపోయినాయి;

కలికాలం వొచ్చింది - భగ్గుమని మండిపోతూంది, కాల మానం. — ఇహ యెప్పుడూకూడా పంటలు పండవు కాబోలు, కొంపతీసి, భగవంతుడా! నా యెరుకను మాతాత సంపాదించిన భూములన్నీ తణఖాలకింద పడిపోయేయి. అయితే ఇహ పిల్లలంతా దివాలాతీసి, మలమలా మాడిపోవలసిందేనా?...మేమంతా పాడైపోతేనున్నా, పంటలు నాశనమైతేనున్నా, పట్నవాసాలోళ్లు, సల్లగా కాలుమీదకాలేసుకొని బతుకుతారా? బతకనీ, బతకనీ...ఎప్పటికైనా, కడుపు మండిపోయి యేడుస్తూన్న మా ఉసురు తగలకపోతుందా?...ఛీ ఛీ, ఇది న్యాయాని క్కాలంకాదు. ఇహ ఈదేశం బాగుపడ్డం సున్న.

[ ప్రవేశము - గురప్పనాయుడు ]

గు—[ తనలో ] ఏం, పాపం! ఇత నింతలా విచారిస్తున్నాడు? మరేంకష్టం రాలేదుగద! [ ప్రకాశముగా ]. తిమ్మయ్య బాబూ!, ఏమలా, ఏదో చాలా విచారిస్తూన్నట్టుంది. అంతా బాగున్నారా?

త—నువ్వు వెయ్యేళ్లా బతుకు. అంతా బాగున్నారు కాని, చూసేవా, గురప్పా, ఈకాలం, చూస్తూవుండగా ఎలాగ తగలడిపోతూందోను?

గు—ఔను, మరి, నిజమేను. కేవలంగా, వర్షాన్నే నమ్ముకునోళ్లంతా ఈయేడు కొంత దెబ్బతిన్నారు. అందు

లోనూ, మీవారిచేలు పురుగునాకేసిందనివిని, చాలా విచారించేను. పాపం, పాపయ్యకూడా నెత్తీ, నోరూ కొట్టుకొంటున్నాడు. పెద్దోడివి, ఓదార్చవలిసినోడివి, నువ్వే ఇలాగ అధైర్యపడితే యెలాగు ?. కాలం ఎప్పుడూ ఒకాలాగే ఉంటుందామరి ?

త—[పెద్దనిట్టూర్పుతో]. ఇస్స్ - అబ్బా - ఏం చెయ్యనూ ? చూస్తూఉందాం. ఇంకాఏం విపరీతాలు బయలుదేరుతాయో-ఇంతకూ మనచేతుల్లో ఏముంది ? భగవంతుడిదయ. పోనీ దానికేంగాని, అయితే ఏ మిలా దిగబడ్డావు ?

గు—నువ్వు కోప్పడనంటే చెబుతాను. నిన్ను ఒక మంచి సభకు తీసుకెళ్దామని వొచ్చేను.

త—నా బతుక్కి, సభ ఒక్కటే తక్కువొచ్చింది కాబోలు !

గు—అదికాదోయ్. మనపూరి కష్టపడప్పుడు వొస్తూపోతూఉంటాడు-?

త—పోలీసువాడా ?

గు—[నవ్వుచు] అచ్చే, కాదు. మంచాయనోయ్—

త—[మాటకు అడ్డొచ్చి] పన్నువేసీవాడా, లేకపోతే టీకాలేసీబాబా ?

గు—[చిరునవ్వుతో]. నీభయం పాడుగాను. అంత పాడు లేమిటోయ్, మనబాగుకోసమే పంటలు చూసిపెట్టి, ఏభూములకు ఏయెరువు వెయ్యాలో, ఏపంటలో ఎంతలాభముందో చెబు[స్తు]తాడూ-అతడు, గోపరాజుగారని, మహా మంచోడులే. అతడు ఈవాళ సాయంత్రం, సంతబయల్నో, కొత్తమోస్తరు వ్యవసాయంగురించి మంచికథలు, పురాణంలాగ చెబుతాడు—సంతలో దండోరా వేశారు. చీకటిపడ్డాక, లాంతరుబొమ్మలు చూపిస్తారు.

త—వీళ్లూ కొత్తమోస్తరుగా [క్షు] చవరంచేస్తారా యేమిటి? నాకు.—నాయనా, వీళ్లసబలవల్లా, పురాణాల వల్లా, బొమ్మలవల్లా పంటలుపండుతయా?...వాడేకబోసు, ఒహనాడు పంట చిత్తపట్టిపోయి నేను ఏడుస్తూఉంటే, చేలోంచి పురుగులు తీసుకుంటానని కబురుపంపేడు, తాను కూడా వస్తానన్నాడు. చస్తూఉంటే సంది మంత్రం అన్నట్టు వీడిగొడవ నాకు అసహ్యంవేసింది.

[బాపనోడికళ్లుపడితే, ఉన్నదికూడాపోతుందని] పొలం పొలిమేరదాటి లోపలి కొస్తే, కాళ్లు విరక్కొడతానన్నాను. ...అక్కడినుంచి అతను నావూ సెత్తలేదు.

గు—ఎంతపని చేసేవోయ్. ఆ మంచిపంతుల్ని...... పోనీలే. ఈసబకొస్తే అతనిసంగతి నీకే బోధపడుతుంది, అతని మాటలు గట్రాను.

త—వాడిసంగతి నా కేల. నన్నీలాగబతకనిస్తారూ. నువ్వు కావలిస్తే వెళ్లు.

గు—నిన్నెలాగైనా తీసికెళ్ళక మానను. నీకు బాగా నచ్చచెప్తాతాను, ఏంకావలిస్తే అది. నామాట విను.

త—వాడు చెప్పడంమాట, దేముడికి తెలుసును గాని, ఇప్పుడు శిస్తులుకట్టడానికి చేతులో ఒహాగవ్వైనా లేదు. కట్టడం ఆలస్యమైతే, కొంపా, గోడూ వేలంవేసేశారన్నమాటే. ఈలోగా ఎలాగైనా సుబ్బిశెట్టికాళ్లు ఇంకోమాటు పట్టుకుంటినా, ఈగండం దాటుతుంది.

గు—అస్తమానూ రానంటే, మనం బాగుపడడం యెలాగు? ఇంకా శిస్తువాయిదాకి వారంరోజు లుంది గనక, ఈవాళ కాకపోతే రేపాయెను, శెట్టిదెగ్గిర కెళ్లడం. ఈపంతులే రేపింకోఫ్యారు పోతాడు. మళ్లామళ్లానీకోసంఇంకోసబ యెవరు చేస్తారు? అదిగాక, ఇవాళ మునసబుగారు, కరణంగారు, పోలయ్యా, వెంకయ్యా, వాళ్లజట్టుతో వొస్తారు. ఒకమారు విన్నంతమాత్రాన్న నష్టం లేదుగద - నామాట విని రా.

త—సరే - మరైతే అలాగే కానీ. వాళ్లొస్తారుగద!

గు—నేను ముందుగా వెళ్తా - మరిచిపోకేం - మీ పెద్దాణ్ణికూడా తీసుకురా - వాడికీ బాగా బోధపడుతుంది - బారెడుపొద్దుండగానే అక్కడ ఉండాల... వెళ్లొస్తునా?

త—సరే - వస్తానులే.

[గురప్ప నిష్క్రమించును.]

త—ఏమ చెప్పినదాన్లో ఏదో ఉండకమానదు. ఎంతమంచికి కాకపోతే, మునసబుగారు, వారు, మిగిలిన మోతుబరిరైతు లందరూ వెళ్లేరు. గురప్పకూడా మంచి తెలివితేట లైనవాడే - ముందు కొచ్చేమార్గం చూస్తూ ఉంటాడు - అయితే నబ కెళ్లాలిమరి ... ఆపంతు లేమీ అను కోడుగద! ... గురప్పున్నాడు గనక భయంలేదు.

[తెర వ్రాలును].

---

౨ - వ రంగం

స్థానము : సంతబయలు

[చాపలమీద, మునసబుగారు, కరణంగారు, తమ్మయ్య కొడుకు, గురప్ప, మరి ఇద్దరు, కూర్చుందురు.]

[ప్రవేశము గోపరాజుగారు]

అందరు—[ లేవబోదురు ]. దండాలుబాబు

గో—[ చిరునవ్వుతో ] [దండములు అందుకొనుచు] మంచిది, అంతా వచ్చినారా ? కూర్చోండి, కూర్చోండి. ఓ రయితుసోదరులారా, దండోరాచాటింపువిని మీరందరూ

ఇక్కడకు వచ్చినందుకు చాలా సంతోషంగా ఉన్నది. కొత్తపద్ధతులుగా వ్యవసాయం చేయడమునుగురించి, చెప్పడానికిముందుగా, మనదేశమందు మనపూర్వులకు ఎంతవరకు వ్యవసాయశాస్త్రం తెలుసునో చూదాం. వారు శాస్త్రాన్ని ప్రత్యేకంగా వ్రాయకపోయిననూ, వారికున్న జ్ఞానం అంతా వేదం చెబుతూనేయున్నది; పురాణాలు, ఇతిహాసాలు దాన్ని చాటుతున్నాయి. అందుకు నిదర్శనంగా ఒకచిన్నకథచెప్తాను, మీరు సావధానంగా వినండి.

అందరు—తప్పకుండాను. బాబు, సెలవియ్యండి.

త—(గురప్ప చెవిలో మెల్లగా) ఈబాబేనోయ్ ఆనాడు పురుగుల కొచ్చినాడు.

గు—(తమ్మయ్య చెవిలో) బయంలేదోయ్. మంచోడేనూ.

గో—శాస్త్ర పురాణంధోరణిలోనే చెబుతాను. మీకు బాగా బోధపడేలాగ. ఒహానాడంతటా, వైకుంఠంలో, మేడమీద పువ్వులపాన్పుమీద విష్ణుమూర్తివారు పడుకుని ఉండగా, లక్ష్మీదేవి ఆయనకాళ్లు పడుతూఉన్నదట. అలా ఉంటూఉండగా, ఏవో లోకాభిరామాయణంకబుర్లు చెప్పుకుంటూవచ్చేరట. అందులో ఒకమాటకు లక్ష్మీదేవి గర్వంగా భర్తతో అన్నాదటా- ఏమనంటే "ఏమండీ, చూసేరా! నా

మీద ప్రపంచాని కంతా ఎంతవ్యామోహమో? నాకోసమే కదా, అందరూ ఎలాగు తపస్సు ధారపోస్తూంటారో! నేను అక్కఱ లేనివాళ్లెవరైనా ఈచతుర్దశభువనాల్లోనూ ఉంటారా?" అని. అనడంతోనే విష్ణుమూర్తివారికి, ఈవిడగర్వం కాస్త అణు ద్దామని తోచింది. వెంటనే ఏమన్నారయ్యా అంటే, "ఓసీ, వెఱ్ఱిదానా, ఎందుకంత లాగు కులుకుతూ వుంటావు. ఏం జూసు కోని—ఈప్రపంచంలో జరుగుతూఉన్నటువంటి కలహాలకీ, మనస్పర్థలకీ, పాపాలకీ అన్నిటికీ నువ్వే కారణాంగదా. పోనీ, దానిమాట కేమిగాని, నువ్వు ఎల్లప్పుడున్నూ ఏసుబ్బి శెట్టినో ఆశ్రయిస్తూఉంటావుగాని, లక్షణంగా చెమటప్రార్చి, వొళ్లు దాచుకోకుండా కష్టపడి పనిచేసేటటువంటి రయితు వాణ్ణి చూడనైనాచూడవుగదా" అలాగూ అని.

గు—ఆ లచ్చిందేవొస్తే ఒక్కఎగురుఎగరమామేము?

గో—అలాగే ఎగరండోయ్. యెవ రొద్దన్నారు.

కథపట్టు కొద్దాం. లక్ష్మి కాస్త తటపటాయిస్తూ అన్నాదట - "అయితే నన్నూ, ఏంచెయ్యమన్నారు" అని - అందుకా విష్ణుమూర్తివా రేమని సెలవిచ్చేరంటే "పోనీ వాడిదెగ్గిరకుకూడా ఒకమాటువెళ్లిరా; ఆకష్టసుఖాలు నీకే తెలుస్తాయి" అని- ఈప్రకారంగా కొంత వాగ్వాదం జరిగినపిమ్మట... మరికొన్నాళ్లకల్లా, ఒహ గాలివాన వొచ్చింది;

రాత్రిపడిపోయింది - ఇదే సమయంగదా, అని అనుకొని అల్లావేళ భర్త [మొగుడి] మాటలు తల్చుకొన్నటువంటిదై, లక్ష్మీదేవి ఏంచేసిందా ? రయితువాడిని ఎవణ్ణయినా చూచి వత్తామని నిశ్చయించుకుంది. ఒకవేళ తననగలూ, నాణేలు చూచి భయపడతాడో, లేక దోచుకుపోతాడో, అసిగాక తనను, పోల్చేసుకుంటాడేమో అనుకొని ఒక బీదకాపుదాని వేషం వేసుకున్నటువంటిదై, వైకుంఠంనుండి మన భూలోకానికి దిగినాదండయ్యా.

గు—ఆ రావడం మెవరింటి కొచ్చిందో ?

గో—(చిరు నవ్వుతో) పోనీ, మీలాంటి రైతింటికే వచ్చిందనుకుందాము. వచ్చి, గుడిసెతలుపు కాస్త మెల్లిగా తట్టిందట. 'ఎవరువా'రని తలుపుతీసి రయితు ఆవిడని ఇలాగున కుశలప్రశ్నలు చేశేడు. "ఎవరమ్మా నువ్వు? ఇంతరాత్రి వేళ, ఇలాంటి గాలివానలో ఇలాగ వచ్చేవు? దారి తప్పిపోయివచ్చినట్టుంది. పాపం, తడిసిపోయినావు కాబోలు. ఏమి కావాలమ్మా" అన్నాడు, బహువినయంతోనున్నూ, మర్యాదతోనున్నూ. ఆవిడ మనస్సులో "నిజంగా దారితప్పేవచ్చేను" అని అనుకుంటూవున్నదై పైకిమాత్రం "అబ్బే ఆట్టే తడియలేద"ని చీరతడుముకుంటూ అన్నది. "అమ్మా భోంచేస్తావా? మాతోపాటు గంజో, కడుగో తాగుదువుగాని రావమ్మా" అని రయితు ఆహ్వానించేడు ఎంతబీదవాడైనానూ.

ఒకరు—మన దేశం మర్యాద అంతే కాదండీ.

౧—అందులో ఆశ్చర్య మేముందండీ. ఈలాగున పిలిపించుకున్నటువంటిదై లక్ష్మి ఏమన్నదంటే, "భోంచేసే బయలుదేరేను. చీకట్లో దారితెలియక ఇలాగున రావలసి వొచ్చింది. నాకు మరేమీ అక్కరలేదుగాని, ఈరాత్రికి పడుకోవడానికి కాస్తచోటుయిస్తే చాల్ను. అదేపదివేలూ" అని "అయితే సరేనమ్మా, కాని, మాగుడిసె ఈయేడు ఇంకా నెయ్యకపోవడంచేత ఈవానకు ఉరుస్తూంది. గనుక నీకు ఇంకో మంచిజాగా చూపిస్తాను. నిన్ననే నాలుగు కమ్మలు తెచ్చి నేసేను మాయెకువులపాక. అందులో నీ మట్టుకు చోటు చేస్తానుదావమ్మా" అని ఆవిడని పిల్చుకొని ఎదురుగా ఉన్నటువంటి చిన్నపాకలో కాస్తచోటుచేసి ప్రవేశపెట్టేడయ్యా ఆవిధంగాను.

ఈప్రకారంగా లక్ష్మీదేవి, పశువులయెరువు నిలవచేస్తావున్నపాకలో ప్రవేశించినదై మనస్సులో ఇలా గనుకుంటూన్నది. "ఈకంపు ఎలాగభరించేదమ్మా! ఎన్నడూ ఎరగను. ఇలాగ ఉత్తనేలను పడుకోవడం. అయినప్పంటికిన్ని నేను ఈనాడు ఉంటూఉండడంవల్ల ఈపేడవేస్తే బంగార్లాంటి పంట పండకతప్పదు" అని.

ఒకరు—తల్లీ! మరింకేం గావాల?

గో—నిజంగా అలాగేమరి, ఆపశువులకు యెరువును గురించి చెప్పవలిసింది చాలాఉందిగాని...కథకు వద్దాం. ఈ ప్రకారంగా ఆరాత్రి అంతా కష్టంమీద గడిపినదాకుం టూన్నా, తెల్లవారుఝామున యథాప్రకారంగాలేచి, తన భర్తను ప్రార్థించుకున్నదట.

ఇక్కడ ఇలాగుంటూయుండగా, వైకుంఠంలోకూడా, ఆసమయమందే, మేలుకొలుపులు పాడగా లేచినటువంటి వాడై, విష్ణుమూర్తివారు భార్య కనబడకపోవడంచేత, కొంచెం కలవరపడి, వెతుక్కుందికి బయల్దేరేడయ్యా, దారిలో బ్రహ్మయున్నూ, మహేశ్వరుడున్నూ కనబడి, వాళ్లుకూడా వెంటబడ్డారు, కలిసి వెతకడానికి.

గు—ముగ్గురూ మూడుమూలలకీ వెళ్లితే, వేగం వెతుక్కునియుందురేమో ?

గో—ఇదంతా ఆపరబ్రహ్మస్వరూపంఐన భగవంతుడి యొక్కమాయ. ఆయనే ఈబ్రహ్మవిష్ణుమహేశ్వరాకారము లుగా పరిణమిస్తారుగాని వాళ్లకు తెలయనిసంగతేమిటి ?

అందరు—చిత్తం.

గో—ఆవిధంగా త్రిమూర్తులున్నూ, ఆయెరువుపాక దెగ్గిరకు వేంచేసేరయ్యా. ఆక్షణంలోనే వచ్చేటప్పటికి మన రయితేంజేస్తూవున్నాడా అంటే, లక్షణంగా బండీకట్టుకొని,

ఎరువు తోలుకుపోడానికి తానుకూడా పాకవెగ్గిరకేవచ్చి, బండి నిలుపుతూన్నాడు. తక్షణమే వీళ్ల దివ్యతేజస్సును చూడలేక మూర్ఛపోయినాడయ్యా. వెంటనే త్రిమూర్తులున్ను మంత్రోదకం జల్లడంచేత, తెలివితెచ్చుకున్నవాడై, వాళ్లకు సాష్టాంగపడ్డాడు. ఈలోగా లక్ష్మీదేవి ఏంచేసిందంటే, తన చీరకు అంటుకున్నటువంటి పేడ దులుపుకుంటూ భర్తదెగ్గిరకు వచ్చి "నాకు గర్వభంగం చెయ్యాలనిఉంటే ఇంతబాధ పెడతారా" అని కించిత్తు ఉడుకుపోతుతనముతోను, అలుకతోనూ చెప్పకుందట. "అందుకుగాదు ; ఈరయితును రక్షించడంకోసమే నిన్ను ఇక్కడికి పంపించినా"నని భర్త చెప్పడంతోనే పూర్ణచంద్రబింబంలాగ ప్రకాశిస్తూ ఉన్నటువంటి ముఖముకలదై, కలకలలాడుతూన్నటువంటి నిజరూపందాల్చినటువంటిదై లక్ష్మి ఏమన్నదంటే - "ఈరయితు మహాపుణ్యముచేసినాడు; బహుధన్యుడు - వీనిమెరువుకుప్పలున్ను, మెరువుగోతులున్నూ బంగారము నిచ్చుగాక" అని రయితును దీవించింది.

అందరు—తల్లీ, మాలచ్మి, మమ్మల్నికూడా కటాచ్చించు.

గో—ఒకరైతుని దీవిస్తే, మీాకందరికీ చెందుతుంది గదా... గనుక ఈప్రకారంగా లక్ష్మీదేవి దీవనలందుకొని, ఆవిడకుకూడా సాష్టాంగపడినటువంటివాడై లేచి, త్రిమూా

స్తేలూ ఏమిసెలవిస్తారో అని చేతులు జోడించుకొని నిల్చున్నాడు.

వారు ముగ్గురున్నూ ఎరువుపాకలోకివచ్చి, ఆ పశువుల యెరువును ఈవిధంగా వర్ణించడం ప్రారంభించేరయ్యా.

పాట

[మట్టు - కోడీ, నాకోడీ - వలె.]

ముగ్గురు—

పేడా - ఓ - పేడా,

మాపశువ్రాల పేడా.

[మాగొఱ్ఱెలపేడా - మా - బఱ్ఱెలపేడా].

నీవంటి యెరువు లేదంచు,

నోంటిగా నుతింపవలెను. పేడా.

[ఈప్రకారంగా, ఇంతమట్టుకు ముగ్గురూ పాడినటువంటివారై, తరవాత, ప్రత్యేకంగా ఒక్కొక్కరే దాన్ని పొగడడం ప్రారంభించేరయ్యా.]

పాట [తరువాయి].

బ్రహ్మ—

నీవిచ్చేటి *పంటలలో,

విటమినులూ హెచ్చుగావె. పేడా.

---

* గింజలలో [అని పాఠాంతరము].

విష్ణు—

నీసాటిఎరువు జగతిగలదె,
సస్యపోషణమునకో. పేడా.

శివుడు—

నిన్ను గాల్చినన్నా, బూడిదైన
కాస్తగుణము నీయకున్నె. పేడా.

[తిరిగి, ముగ్గురూ కలిసి మిగిలిన చరణములు పాడేరయ్యా].

పాట [తరువాయి.]

† మూత్రమంత పైకిబోక-మునుపు గడ్డిగావలందు
ఇంకనిచ్చి దానిచేర్చ,
నింకసాటి యేదినీకు. పేడా.

చివికినట్టి ఆకులలముల్, చెత్తగడ్డి గానియూం
గాన్గపిండి, దుమ్ములైన
కలియగానె, వన్నెతెచ్చు. పేడా.

‡ శాశ్వతంబుగాగ "సర్వసస్య చింతామణి" [యను
బిరుదునీకుచెల్లకున్నె? సిరినివాసమాడుగాత.

పేడా - ఓ - పేడా.

---

† నీరుడిని, పైకిపోవ - నీక గడ్డిగావలంను.

‡ సార్థకంబుగాగ [అని పాఠాంతరము].

ఈవిధంగా పాడిపంటలుకు దేవివారైన బ్రహ్మా విష్ణుమహేశ్వరులున్నూ, లక్ష్మీదేవియున్నూ అంతర్ధానం అయిపోయినారయ్యా.

అందరూ—తండ్రీ భగవంతుడా, రక్షించు, రక్షించు.

గో—మనలనందరినీ రక్షించడమే ఆయనయొక్క మొదటిపని. గనుక భగవంతుని అవతారమైనటువంటి శ్రీ కృష్ణమూర్తివారు పాడిపంటలను అభివృద్ధిచేయడానికి పూనుకున్నటువంటివారై, పిల్లనగ్రోవిని ఊదుకుంటూ గోవులను గాచుకొని, యథేష్టంగా పంటలు పండిస్తూ ఉండేవారు. "పంట పెంటలో ఉన్నది; పాడి పచ్చికలో ఉన్నది." అనేటటువంటి మన సామెత జ్ఞాపకంతెచ్చుకోండి. పేడకు, పెంటకు మించిన యెరువు ఈప్రపంచంలోలేదని గట్టిగా నమ్మండి.

త—[ గురప్పతో ] ఆమధ్య ఇంకోపంతులు వెయ్యమంటే ఏదో తెల్లఉప్పువేసేసరికి మొదట బాగుపడి తరవాత మాడిపోయేయి మాచేలు. అక్కడనించీ, వీళ్లమాటంటే నాకు గిట్టలేదు.

గు—ఇతను అలాంటిబాబుకాడు. చూసేవా ఆయన ధోరణి.

త—నిజమే.

గో—ఈకథకు అనుగుణ్యంగా, కొన్ని నిదర్శనాలు చూపిస్తాను. ఎరువు లన్నింటితోనూ, కోయంబత్తూరులో

పరిశోధనలు చేయగా తేలినటువంటి భోగట్టాకూడా ఇంతేను. ఇటువంటి రసాయనిక పరీక్షలు ఏలాగు చేసేరో, ఆ చెయ్యగా వచ్చిన ఫలితాలేవో, లాంతరుబొమ్మలు చూపించి, ఇంకా విశదంగా బోధపరుస్తాను. గనుక మీరందరున్నూ, మీ స్నేహితులతో కూడా, భోజనాలైనతరవాత కరణంగారి వాకట్లో తిరిగీ సమావేశం కావలసిందని నాకోరిక.

అందరు—ఇంతకన్నా ఉందా. బాబూ, తప్పకుండా వస్తాము.

కరణం—ఒరే, వెంటన్నా! ఇవాళ పొద్దున్నే, పేరయ్యా, ఎల్లయ్యా కలిసి కొత్తపల్లి వెళ్లేరు. వాళ్లీపాటికి వచ్చే ఉంటారు గనుక వస్తేమాత్రం తప్పకుండా తీసుకొనిరా. అన్నట్టు మరి చేను. కాగడాలకి ఆముదము జాగ్రత్త చెయ్యి. ఇప్పుడే వాకిలి తుడిచేసి పేడనీళ్లు జల్లించేసి, అంతా ఫస్టుక్లాసుగా చేసే య్యాలి, దబ్బునరా.

ఒకడు—ఇదుగో వెళ్తున్నా. [నిష్క్రమించును].

మునసబు—ఒరే లింగా, ఒకకట్టా పొవ్వాకు, ఒకకట్ట చుట్టలు మరిచిపోకుండా తే. రేపు డబ్బిస్తా.

ఒకడు—చిత్తం. [నిష్క్రమించును].

కరణం—ఓయ్ గురప్పా! బాబుగారికేం గావాలో నువ్వే చూసుకోవాలి సుమా.

గు—మంచిది. [తమ్మయ్యతో] తమ్మయ్యా, పో పోదాం. బాబుగారి సెలవు పుచ్చుకో.

[గో. రాజుగారితో]. అయ్యా సెలవా? ప్రాతర్దర్శనం చేసుకుంటా. దండాలు.

త—దండాలండి బాబు.

[గురప్ప, తమ్మయ్య నిష్క్రమింతురు].

గో—మంచిది. [అందరూ నిష్క్రమింతురు].

---

# కృషీవలవిజయము

---

## ౨-వ అంకము

---

### ౧-వ రంగము

స్థానము : వీధి

[ప్రవేశము: శంకరశాస్త్రి పొడుం పీల్చుకుంటూ]

శం—కృష్ణమూర్తిపంతులంటే మహా గొప్పవాడని ప్రఖ్యాతి. పేరుగొప్ప, ఊరు దిబ్బాను. సదస్యానికి రూపాయ లిస్తారేమో అనుకున్నాను. పావలాఇచ్చి పైకి పంపేశాడు. పోనీ ఇవాళ ఇంతే ప్రాప్తం మనకి.

[ప్రవేశము : గోపరాజుగారు]

గో—శాస్త్రుల్లుగారూ, నమస్కారం. తమ దర్శనం చేసుకుందామని శానాళ్లాయి ప్రయత్నం. ఇన్నాళ్లకి సంభవించింది. అదే సంతోషం.

శం—నమస్కారం, బాబూ. తమది వ్యవసాయం ఇలా కా గావండీ? కరణంగారు చెప్పేరు. తమనామధేయం బాగా

జ్ఞాపకం లేదు. క్షమించండి. నేనుకూడా రావాలనుకుంటేను, ఈమధ్య వ్యాపకాలు ఎక్కువైపోయేయి.

గో — నన్ను గోపరా జంటారు. నేను ఈ ప్రాంతంలో వ్యవసాయప్రచారకుణ్ణి. అంటే వ్యవసాయపరిశోధనా ఫలితాలను రయితులకు తెలియజేసే బాధ్యత నాయందు ఉంచినారన్నమాట.

తమరైతే, బహుధన్యులు. ఉపాధ్యాయవృత్తికంటె ఉత్కృష్టమైన దున్నాదండీ. అందులో మీరు పండిపోయేరు. ఈ గ్రామవాసులందరూ తమ శిష్యబృందమేకద! తమ సహాయం అక్కరలేనివాడు ఒకడైనా ఉండడుగద!

శం — అలాక్కాదు, క్షమించండి. గ్రామస్థులందరి ప్రాపకమూ ఉంటేనేగాని, మాలాంటి స్కూలుమేష్టర్లు బతకలేరనండి. తమకు తెలియదుగనకనా? జీతపురాళ్లు, కుర్రాళ్ల చల్ది అన్నానికైనా సరిపోకపోవడంచేత, మేము పౌరోహిత్యం, పురాణకాలక్షేపం, జ్యోతిషం, అవకాశమైతే కాస్త వైద్యం, అవసరమైతే శవాలమోత, బ్రాహ్మణార్థాలు, ఇత్యాది వ్యాపకాలు పెట్టుకుంటేనేగాని, కాలక్షేపం కావడంలేదు.

గో — నేను పలుకుబడివిషయమై ప్రసంగించేనుగాని, ఇలా గనుకుంటారని తెలియలేదండీ, క్షమించండి.

శం — ఎంతమాట! బాగుంది. నాధోరణి ఎప్పుడూ యిలాగే ఏడుస్తుంది గాని తమకార్యం సెలవియ్యండి.

గో—కార్యం ఒకటికాదు – చాలా ఉండడంచేత బహుసంగ్రహంగా మనవిచేస్తాను... "కృషితో నాస్తిదుర్భిక్షం జపతోనాస్తి పాతకం" అన్నాడు శాస్త్రకారకుడు, చిత్తగించేరా. అందుకనే శ్రీకృష్ణభగవానుడు దేశమంతా సుభిక్షంగాచేసేటందుకు జగన్మోహనంగా మురళీగానం చేస్తూఉన్న గోరక్షకుడుగానున్నూ, అన్నగారైన బలరామస్వామి హలాయుధంతో సకలసస్యపోషకుడుగానున్నూ వెలసేరుగదా!

శం—ఓహో! ఏం దివ్యంగా సెలవిచ్చేరు! [ఇంకోహాపొడుంపట్టుపీల్చి] వేదార్థాన్ని వ్యవసాయపరంగాచేసి వారేస్తున్నారే?

గో—తమపోగ ్డకు తగనుగాని; అల్లాగు సుభిక్షంగా ఉంటూవున్న మనదేశం వేదకాలంనాడున్నూ, ఇటీవల కొన్ని వందల సంవత్సరాలవరకున్నూ బాగుండి, అప్పటినుండీ నానాటికి క్షీణిస్తూవచ్చిందని మీకు తెలిసిన విషయమే. నేటి దుస్థితి మనదేశాన్నే కాకుండా ప్రపంచాన్నంతటినీ ఆవరిస్తూన్నది, లెండి. గాని మనకిమాత్రం ఇంతగట్టిగా దెబ్బ తగలడానికి ముఖ్యకారణాలు ఏవంటే మనది వ్యవసాయమే ముఖ్యవృత్తిగా గలదేశ మవడమున్నూ, విద్యాధికులావృత్తిని బహిష్కరించడమున్నూ. సామాన్యంగా రయితులకు అక్షరజ్ఞానము, ప్రపంచజ్ఞానము లేకుండుటచేతనున్నూ, ఉన్నప్పటికీ అది చాలకుండుటచేతనున్నూ, బాగుపడేమార్గాలు త్వరగా నేర్చుకో

లేకుండా వున్నారు. అదీగాక, మన స్కూళ్ళలో తమవంటి ఉపాధ్యాయులకుండే పలుకుబడి మరెవ్వరికీ ఉండజాలదు. గనుక తమరుకూడా కాస్త శ్రద్ధతో దఖలు పుచ్చుకుంటే గ్రామపునర్నిర్మాణ(Rural Reconstruction) మనే సమస్య, సులభసాధ్య మవుతుంది. వ్యవసాయవిషయమైన భోగట్టాలు నేను తమ సహాయంచేత అందరు రయితులకూ చెప్పగలను గాని, తమరు నిర్వహించవలసినదేమంటే స్కూలు పిల్లలకు చిన్ననాటినుండీన్నీ శరీరపరిశుభ్రతను గురించిన్నీ, గ్రామపారిశుభ్యంగురించిన్నీ, సహకారసంఘాలను గురించిన్నీ చర్చిస్తూ ప్రపంచజ్ఞానం అలవరుస్తూవుంటేనేగాని శాంతి వాతావరణం ఏర్పడదు. ధనం, సుఖం, ఆరోగ్యమున్నూ అభివృద్ధిపొందవు.

శం—తమరు విధిస్తే, కాదనడంనాశక్యమా? అయితే ముసలికాలంగనుక ఓపిక చాలదు. హోమంచేసుకుందికే తెరిపి లేకపోతూంది. గాని తమరు ఫలానిఫలాని, భోగట్టాలు చెప్పమని సకృచ్ఛంగా సెలవిస్తే కుర్రవాళ్ళ కొప్పచెప్పేస్తాను. వాళ్ల దెగ్గిరనించి ఒప్పచెప్పకుంటాను. తిరిగీ తమ దర్శనం చేసుకుంటా. సంధ్యాకాలం అయింది. సెలవా?

గో—చిత్తం ఆమాత్రం అభయం ఇచ్చేరు. అదే చాలున్నూ.

[ఇద్దరూ నిష్క్రమింతురు.]

---

## ౧-వ రంగము

### స్థానము—ఇల్లు.

[సందుగపెట్టి ముందర సుబ్బిశెట్టి కూర్చొనును].

సుబ్బిశెట్టి—ఎలాగైతేనేం. డబ్బు జాగ్రత్త చేసినవాడే ఘనుడు. మా తాత బహుకష్టపడి, కడుపుకట్టుకొని, ఒక వెయ్యిరూపాయిలు జాగ్రత్త చేశాడు. ఆ మదుపు పెట్టుకొని మా తండ్రి వడ్డీవ్యాపారం నిరాఘాటంగా సాగించి, వడ్డీలమీద గుజస్తువడ్డీలులాగి, పదివేలు పోగుచేశాడు. ఇక నేను ఒక *'ల'కారం చూడకపోతానా?

కాటకాలొచ్చిన కొలదీ లాభాలు ఎక్కువగా వస్తాయి. పోయినయేడాది బాగా పండింది గనక చవకగా ధాన్యాలుకొని కొట్లు నింపేశాను. ఈయేడు కాటకంనుంచి పంటలుపోవడం చేత—ఇంకేముంది?—ధరలు ఒక్కసారి బిగించేశాం, నలుగురు కోమట్లమూ ఏకమై. ఈ వెధవ రైళ్లు పడబట్టిన్నీ, అదేనా ఈమధ్యనే ధరతగ్గించవలసొచ్చిందిగాని లేకపోతేనా ...హుం...శిస్తులూ, దస్తులూ కట్టేసమయం వొచ్చిందా, ఇప్పుడు మహాపుణ్యకాలం. వహవ్వా! - వడ్డీలు, రూపాయికి అణాలు, సమయాన్నిబట్టి బేడలూ బిగించేసి, సంచులమీద సంచులు పేర్చెయ్యక పోతానా?...

---

* అనగా ఒకలక్ష.

ఈ వల్లకాటికోపరేటు బేంకు లంటూ వచ్చి మా వ్యాపారాలన్నీ పడగొట్టేశాయి - ఏమిటో, గవర్నమెంటు, గవర్నమెంటో అని అంటారుగాని, వారు అందరిలాభమూ ఆలోచిస్తూన్నట్టు నాబుద్ధికి తోచడంలేదు. కాకుల్ని కొట్టిగద్దల కేసినట్టు, సర్కారోళ్లు మమ్మల్ని చంపేసి, కాపోళ్లకి లాబం చేస్తారంట.. సరే - చూద్దాం - సమయం దొరక్కపోతుందా. అమాంతంగా మింగెయ్యనూ.

[తలుపు తట్టబడును - "బాబూ, సెట్టిగారూ" అనే పిలుపు.]

సు—ఎవరో వొచ్చేరు. పోలీసోళ్లు కారుగద, కొంప తీసి! చిన్నమ్మీ, ఎవరో చూడవే, కిటికీలోంచి. పోలీసోళ్లయితే, నేనింటో లేనని చెప్పు.

["బాబోయ్ః నేనండి తమ్మనాయుడు." అని గట్టిగా పిలుపు వినబడును.]

సు—(తనలో) మననాయిడులాగే వున్నాడు. మన పుణ్యం బాగుంది. [ప్రకాశముగా] ఉండవోయ్, నాయుడూ, వస్తున్నా. [అని తలుపుతీసి, తమ్మయ్యనాయుణ్ణి తీసుకొనివచ్చును.] దా, తమయ్యనాయుడూ, కూర్చో.

[ప్రవేశము తమ్మయ్య]

తమ్మయ్య—బాబూ, మునపటిబాకీలూ, సాకీలూ అలాగుండనియ్యండి. ఈవాళ మీవల్ల ఒకచిన్న ఉపకారం కావాలి. ఎలాగైనా లేదనకుండా గడిపిపెట్టాలి.

సు—కూర్చోవోయ్. సావకాశంగా మాట్లాడుదాం. ఏం ఈమధ్య నెక్కడా కనబడడంలేదు? అంతా బాగున్నారా? పెద్దాడికి పెళ్లిచెయ్యలేదూ ఇంకా ?.

త—పెళ్లిమాటకేం, బాబూ, నాకోహ ఏభైరూపాయీలు కావలసి ఉంది. ప్రోనోటుమీద ఇస్సిస్తే, ఊరికే ఇచ్చినట్టు సంతోషిస్తా.

సు—అబ్బ, ఒఖ్ఖమాటే యేభై రూపాయీలే! అదీ, నోటుమీదనా...ఊఁహుఁ [పెదవివిరిచి]. ఇది కుదిరే వ్యాపారం గాదు.

త—మరెలాగైనా, మీరే ఆలోచించాలి.

సు—నీ సత్యకాలంగాని, తమ్మయ్యనాయుడూ, నీకు తెలియదుగాని, ఇప్పుడు బంగారంమీదే డబ్బుపుట్టడంలేదు. కాటకాలగిరాకీ యెలాగుందో తెలుసునా? నువ్వుగనకనూ, మనకీమనకీ, మనతాతలనాటినుంచీ వ్యవహారాలున్నాయి గనకనూ, ఏదో నాలుగైదు తులాలభంగారం తెచ్చేవంటే ఆలోచిస్తాను. [కొంతసేపు ఆలోచించి] మరైతే...

త—ఏదో, నాయింటిదాని [భార్య] నగ తీసుకొచ్చేను, నిర్బంధంమీద [అని మొలనుంచి [illegible] నగబైటపెట్టును]. ఇదుచ్చుకొని తాకట్టు[illegible]డి.

సు—[నగ తీసి, యెగాదిగా చూసి, సంచిలోని గీటు రాయితీసి, చిన్నగీటుపెట్టి, తిరిగి నగచూచి] [తనలో] ఏం మేలిమిబంగారం! చూస్తే వదలబుద్దెయ్యడంలేదు. [ప్రకాశముగా]. అచ్ఛే, యిదేంభంగారంవోయ్. ఎవరిదెగ్గిరకొన్నావో గాని మంచిదగాపడ్డావు. పాపం, గీటుకు రాదుసరికదా. కరిగిస్తే మసడ కాదు. ఉత్తటంకం.

త—బాబు, ఒక మాట తూకించండి. చేయించినప్పుడు ఆరుతులాలుంది. ఇప్పుడు అయిదేనా ఉండదా?

సు—[సంచి వెతికినట్టు నటించి] తూచీదేమిటోయి, నేను రోజూ నగలవ్యాపారంలో ఉండేవాణ్ణి నాకు తెలియదూ? నాలుగుతులాలుండొచ్చు, కష్టంమీద. [తాసు, కట్టెలు ఇప్పుడే రంగంషాహుకారు పట్టికెళ్లేడు. సీనగ యెక్కడికి పోతుంది. తాకట్టెగద.

నగ ఒహానలక్షై, యేభైరూపాయిలు చేస్తుం దనుకుందాం. అది వుంచుకొని ఇప్పటికి పాతిక (౨౫) రూపాయలిస్తాను పుచ్చుకో.

త—అమ్మమ్మో, నగ యెనభైకి తక్కువ చెయ్యదనిన్నీ, యేభయిరూపాయి లైనా దొరుకుతాయనిన్నీ, చెప్పేడు ఒక చదువుకున్నపంతులు. మీరిలాగంటా రేం?

సు—ఆపంతులెగ్గర పుచ్చుకోలేకపోయినావాసామ్మీ?

త—అతనిదెగ్గిర లేదు గాని, ఉంటేనా......

సు—సరిగద! డబ్బులేనోడేం చెప్పినా మీరు నమ్ముతారు, పాపం. పోనీ, నీకుగనక ముప్పై ఇస్తానులే.

త—నలభైయేనా ఇప్పించండి బాబూ, పిల్లలోణ్ణి.

సు—ముప్పైకి ఎక్కువ దొరకదు. కావలిస్తే ఏషాహుకార్నైనా అడిగిరా... అయితే వడ్డీమాటేమిటి? ఏమంత నాకు ఆశలేదు. రూపాయికి బేడలు వద్దు గాని, నువ్వుగనక అణాలు తీసుకుంటాను.

త—అమ్మబాబోయ్! రూపాయికణాలే? ఇచ్చుకోలేం బాబూ; ఆనగిచ్చెయ్యండి, ఇంకోసెట్టికాళ్లట్టుకుంటా - మరి మేం సచ్చిపోమూ, ఆకాడికి ఇచ్చుకోలేక? [అని లేవబోవును].

సు—[తమ్మయ్య చెయ్యిపట్టుకొని ఆపి] కూర్చోవోయ్, అంతలాగ కోప్పడకు - మునపటిరోజుల్లో అంతకు తక్కువవడ్డీకివ్వడంలేదూ? గిరాకీనిబట్టి వడ్డీలుమారుతాయి పోనీ మూడుకాన్లు (౯ పైసలు) చేసుకొని రాసేయ్.

త—బాబ్బాబు! తొమ్మిదిదమ్మిడీలు ఇచ్చుకోలేను, పిల్లలవాణ్ణి: మీకుకూడా పిల్లలున్నారుగద. కిందటినోటు అర్ధణాకి రాసినట్టు గ్నేపకంవుంది. అలాగచేసుకొని రాయించెయ్యండి. లేకపోతే మీదారి మీది, మాదారి మాది.

సు—[మారుమాటాడక ఆలోచించుతూ, నగివైపే చూస్తూఉండును]

త—అయితే, ఇంక నాకు సెలవా? నాభంగారం ఇలాగ పారెయ్యండి.

సు—[తనలో] చాల్ను. ఎంత దొరికితే అంతే చాల్ను. భంగారం వొదలబుద్దెయడంలేదు. వీడెక్కడకైనా పోతే, బంగారం చూచి తక్కువవడ్డీకిచ్చేస్తారేమో డబ్బు. 'తొలిజేరం, తొలకరివర్షం' అన్నాడు. [ప్రకాశముగా] అబ్బా, అంత తొందరేమిటోయ్. నాయుడూ, డబ్బుతో మాటలా? ఎంత నిదానించాలి? ఎంత ఆలోచించాలి? అయితే విన్నావా. "ఊరికి ప్రాణము కోమటి" అన్నాడు. అంచేత, నీ అదునుకి గడిప్పెట్టకపోతే, నేనెందుకూ బతిగి ఉండి? నువ్వింతలాగ తటపటాయిస్తున్నావు గనక అలాగే చేసుకో. అణాస్టాంపు తెచ్చేవా?

త—మీదెగ్గిరుండదా? ఆమాత్రం.

సు—సరే. ఆవొట్టంకూడా నాకేతగులుస్తున్నావూ? కానీ. సాక్షి సంతకానికి ఒకరూపాయి, నోటు రాయడానికి ఒకరూపాయి. తెలుసునుకాదూ రివాజు.

త—అంతా కలిపి ఒకరూపాయి తీసుకోండి, నన్ను ఎంతకన్న కాల్చుకుతింటారు.

సు—[పత్రంవ్రాసి, నిశానీపెట్టించి, లెక్కపెట్టి 30/ రూపాయి లిచ్చి, ఒకరూపాయి తీసుకొనును]. రూపాయిలు ముప్ఫైయిన్నీ ముట్టేయా ?

త—ముట్టినాయిబాబూ, బంగారానికి రశీదిప్పించండి.

సు—[కోపముతో] నీనగ అపహరించేస్తానా యేమిటి. అలా భయపడుతున్నావు ? ఇదుగో, ఇస్తావుంటే యేం తొందరోయ్. [రశీదువ్రాసియిచ్చును]. నీవు అసలు ఫాయిదాలతో నాసొమ్ముచెల్లించినతక్షణం నీనగ నీకు ఇచ్చేస్తాను. [తమ్మయ్య చెవిలో] వడ్డీమాట యెవరితోనూ చెప్పకేం. చెబితే నామీదొట్టు సుమా, నాయుడూ ?

త—అమ్మ, అలా చెబుతానా - ఇక వెళ్లొస్తా.

సు—మంచిది. [అవతలవరకు దిగబెట్టును]

[తమ్మయ్య నిష్క్రమించును.]

ఈబేరం ఇవాళకు చాల్ను. ఇహవీడు నాడబ్బుతీర్చే దేమిటి, నగపట్టికెళ్లేదేమిటి ?...కరిగించేస్తా, తక్షణం. ఏమైనా పీకమీదకొస్తే, పోలీసోళ్లకి మెల్లిగా ఏదో ముట్టచెప్పొచ్చును. అంతకీ వీడు అడగొస్తే, ఇంకోరకం ఇత్తడి బంగారం అంటగట్టెయ్యనూ ?...వహవ్వా ! ఊహా, ఉపాయం, తెలివీ, తేటాఅంటే వర్తకులి దేనండీ. [తెరవ్రాలును]

---

## 3-వ రంగము

### స్థానము : వీధి

[ప్రవేశము : తమ్మయ్య వ్రాలిన ముఖంతో]

త—అబ్బ! ఇప్పటికి సావుకారు నోట్లోంచి బైటపడ్డట్టే. ఈనాయిదా శిస్తుకట్టేస్తే మళ్లా వొచ్చే యేటిదాకా పూచీ లేదు. కాని అయ్యో నగని తల్చుకుంటె దుఃఖం వస్తూందే. (కంట తడిపెట్టుకొని) కొన్నాళ్లు గొప్ప మోతుబరిరైతు నని పించుకొని, కొసకి ముప్పైరూపాయిలకి కోమిటోడిపంచ కెళ్ళ వల సొచ్చిందిగదా! హా! ఎంతదురవస్థ తెచ్చిపెట్టేవయ్యా, దేముడా! (తలయెత్తిచూచి) ఎవరో వస్తూన్నట్టుంది.

[ప్రవేశము : గురప్ప]

గు—ఏం, తమ్మయ్యబాబూ బాగున్నావా ?

ఎక్కణ్ణించేమి టిలాగు ?

త—[నిట్టూర్పువిడిచి] ఏమడుగుతావు నాయనా. సావు కారు సుబ్బిశెట్టింటిదెగ్గిర్నుంచే వస్తున్న తాకట్టుపెట్టి ముప్పై రూపాయిలు పట్టుకొచ్చేను. నిరుడు ధాన్యానికి ధరలేక అమ్మలేదు; ఇప్పుడు పాతరలోంచి తీసిచూస్తే పూచిపోయి నాయి. ఎవరూ కొనడంలేదు. ఈయేడు కాటకంచేత పంట పోవడం, కొంత మిగిలింది పురుగునాకెయ్యడం, తల్చుకుంటే

వొళ్లు నీరైపోతూంది. నాకు అయిపోయిన అప్పులు తల్చుకున్నా, కుర్రాళ్ళని తల్చుకున్నా ఏమిాతింపైనా సాయించడం లేదు; ఆతిన్నదికాస్తా వొంటబట్టడంలేదు. కష్టాల్తో అమాంతంగా కూలిపోతున్నానంటే నమ్ము.

గు—నీలాంటి పెద్దరయితే ఇలాగంటే, ఇహ చిన్నోళ్ళ సంగతడిగేదేమిటి? అందుకే పాపం, చాలామంది రంగం, మోక్షీను. వలసబోయేరు కూలిపనులకి. పాపం, అక్కడమాత్రం యేం సుఖపడ్డారు. కామయ్యబాబు చెప్పేడుకాడూ, వాళ్ల బతుకు?

సరే దానిమాటకేంగాని, నీకోచిన్న సలహా చెప్పాలని వుంది, చిన్నవాణ్ణయినా... కోప్పడవుగద?

త—ఒయ్-వెర్రోడా, నాబతుక్కి కోపంగూడానా?

గు—అలాగన్నావు గనక చెబుతాను. నువ్వునమ్మితే నమ్ము, లేకపోతే మానెయ్. గాని ఆగోపరాజున్నాడే, అంటే ఆనాడు లచ్చిందేవికాడ చెప్పినాయనా, ఏం మంచోడనుకున్నావు? ఇంతెందుకూ? నా బాగుకంతకూ అతడే కారణం. కొత్తవ్యవసాయంగురించి ఆనాడు రాత్రి చెప్పిపోయేడూ. నువ్వు రాలేదుగానీ, నాయ్యో! పాటలో, పద్యాలూ, ధణుతి ఎగరగొట్టేశాడు. ఏంచిత్రమైన బొమ్మలు చూపించేడనుకున్నావు? ఆవేళ రాత్రి రాలేకపోయినావా? మనకి అతనేనైనా ఒకమంచిదారి చూపించకపోడు.

త—రాత్రిపడితే, కన్ను అగుపడదు. నాకు, వృద్ధాప్యం కాదూమరి? పోనీగాని, ఇతనేమిటి, దారిచూపించడమేమిటి, బాగుపడ్డానికి? దేముడుచూపించనిదారి ఇతనికి తెలుస్తుందా? ...ఏమో, కథమట్టుకు బాగా చెప్పేడుగాని.

గు—అలాగ కొట్టి పారెయ్యకూడదు. చూసేవా, నువ్వే ఒప్పుకొన్నావా, బాగాచెబతాడని. అతడికి దేశ దేశాల్లో జరుగుతూవున్న వ్యవసాయం భోగట్టాలు తెలియడమేగాకుండా, కోయంబత్తూరు, అనకాపిల్లి, సామర్లకోట ఇలాంటి ఫారాల్లో కనిపెడుతూవున్న కొత్తపద్ధతులుకూడా మన పల్లెటూళ్ళ స్థితిగతు లాలోచించి లాభం వొచ్చేటట్టు చేస్తాడు.

త—ఆవేళ చెప్పేనుగాదూ. ఇలాగే ఎవరో ఒక పంతులు వెయ్యిమంటే యేదో ఒక ఉప్పులాంటి యెరువు వేసేను. చేలు పూర్తిగామాడి ఊరుకున్నాయి. అప్పటినుంచీ నాకు ఎవరిమీదా నమ్మకం లేదు. ఎవరి ఖర్మం వాళ్ళది. పోనిస్తూ గురప్పా.

గు— అలాగ ముసిలివేదాంతంలో పడిపోతే బతగ్గలమా? పోనీ, మనకథంతా చెబుదాం, ఇలాగిలాగా అని, మర్మం విడిచి. గొప్పోళ్ళ మనుకుంటూ లోపల్లోపల కుళ్లుతూవుంటే యేం లాభం? అతన్ని చూసి, అతనితో నాలుగు

మాటలు ఆడితే, నీకు అతని సంగతి ఇంకా బాగా తెలుస్తుంది. ముఖ్యంగా మొగువులగురించి చెప్పడానికిన్నీ, దగ్గిరుండి చేయించడానికిన్నీ ఆయనతర్వాతే యెవరైనాను. అతనెంత సేపూ "పంట పెంటలోవున్నదంటాడు" గాని ఉప్పల్లాంటివి, అపగండేనూ, అందులోనూ పెద్దపెద్దోళ్ళ నడక్కుండా వెయ్యకూడ దంటాడు.

త—రాజు మాటాడేదోయ్. అకథలోకూడా అలాగే చెప్పేడు.

గు—అలాగ దాన్లోకి రా. అతనికి తోచినసలహాలు చెప్పనియ్యి. మనకి, అలాగ చెయ్యాలన్న ఇబ్బందిలేదుగద... పోలిపోడేంటి? నీకు నచ్చితేచెయ్యి, లేకపోతే మానెయ్. ఏమంటావు? నామాట విను. అతనేమీ దబ్బడగడు.

త—సరే, అయితే ఆలాగేకానీ...అత నెక్కడుంటాడో.

గు—అలా గడుగు, నీకడుపు సల్లగా, నువ్వనుకొనేదేముసు, అతనిలోనే ఉన్నాడేమో. అత నివాళ మాచెరుకుతోటచూడ్డానికి సాయంత్రంవేళ వొస్తానన్నాడు. అంటే, తప్పకుండా వచ్చేడన్నమాటే. గనక రెండుమూడుబార్లపొద్దుండగానే మాతోట కొచ్చెయ్. అతను చెప్పినసంగతులు, వాటి

మహాత్త్యం అంతా చూపిస్తాను. అతను రాగానే అన్నిభోగట్టాలూ అడుగుదాం.

త—అయితే, తప్పకుండా, అలాగే వొస్తా.

[నిష్క్రమించును].

గు—పాపం! ఎంత గొప్ప స్థితిపరు డిలాగై పోయేడు! భూము లన్నీ తణఖా పెట్టేశాడు. బంగారం చాలామట్టుకు తాకట్టడిపోయిందని వినికిడి - ఉన్న బండారం బయటపడిపోతుం దేమో అని, ఎవరితోనూ చెప్పక అప్పులపా లైపోయేడు. కొత్త మోస్తరు వ్యవసాయమంటే వీడికీ, వీళ్ల జట్టుకీ నమ్మకం లేదు... "ఏదో అలాగు రెణ్ణాళ్లు బాగా కనపడ్డట్టు ఉంటుందిగాని తరువాత కుంగిపోతుందం"టారు. అజ్ఞానం. పోనీగానీ, మాటకి తమ్మయ్యవాళ్లు, పాతళ్లలో పూచిపోతూండగా, మాగోపరాజు గారు వేయించిన చెరుకుతోట, నేను కొయ్యనక్కర లేకుండానే, భూమిమీంచే కొనుక్కొని పోలేదూ పేరీకంపెట్టోళ్లూ? ఇదీ అబద్ధమేనా యేంటి? ఏలాగో ఓలాగు ఇతడు గోపరాజు కంటబడితే చాల్ను. తమ్మయ్య రేక బయలుపడక మానదు. చూద్దాం, ఆయన వాడి కేం చెప్తాడో. [నిష్క్రమించును].

# కృషీవల విజయము

## 3-వ అంకము

### ౧-వ రంగం

స్థానము : గురప్పపొలము

గురప్ప—[ కన్నెపలుపులు నేసుకుంటూ ]

పాట

రాగము - నాదనామక్రియ - ఆటతాళం.

పల్లవి :—

[ ఏతీరున నను దయజూచెదవో, ఇనవంశోత్తమ రామా
నాతరమా భవసాగరమీదగ, నలినదళేక్షణ రామా.]

క్రొత్తసాగులో గుణము తెలుసుకొని, రయముగ ముందుకురండీ
నమ్మిచెడినవా రిమ్మహి లేరూ, నమ్మకచెడుచున్నారూ. క్రొత్త.

విత్తనములగుణ వివరము బట్టీ, వాడిన యెరువులబట్టీ,
నీటికొలదినీ పాటుకొలదినీ, ఫలసాయము లాభంబున్.

దేశకాలముల తీరునుజూచియు, మంచిధరలుగమనించి,
బాగాచెల్లెడి పైరులనెక్కువ, పండించినచో నింపూ. క్రొత్త.
వక్ష్లకు ధరలూ పడిపోవుటంచే, వెలగలపైరులు వేయన్
వ్యవసాయంపు డిపార్టుమెంటునూ, సరిగున చేయును సలహా.
ఏయేభూముల నేయేపైరులు, వేసినలాభం బెంతో
ఎట్టిఎరువులానెప్పుడువేసిన,ఫలమో తెలియగవచ్చున్. క్రొత్త.
చెరుకుతోటలూ, అరటితోటలూ, పల్లపుభూముల పండున్
మెరకభూములన్ మిరపకాయలూ, ప్రత్తియు వేయగ రక్తి
వేరుసెనగలూ, కూరగాయలూ, పెంచిన లాభము మించున్
వాటికి తగినా ప్రాణపుటెరువులు, వాడిననేగద- వన్నే.
ఆకుల, ఎముకల నన్నిరకములా కలుపును చెత్తా గడ్డిన్,
గోతులవేసీ కుళ్ళబెట్టినా, ప్రాణముగల యెరువగునూ.
పసులపెంటతో పచ్చియాకుతో, పాటే దీనికి గీటూ
గానుగపిండియు లెస్సగ పంటకు, నెక్కువసత్తువ నిచ్చున్. క్రొ.

[ప్రవేశము: తమ్మయ్య]

త—ఏం గురప్ప తమ్ముడూ, మహా జోరుగా పాడుతున్నావూ? బాబుగా రొచ్చేరా?

గు—వచ్చేవేళయింది. పాట గోపరాజుగారు చేసిన దేను. కావలిస్తే తర్వాత నీకూ, మీఅబ్బాయికీ చెప్తాను.

త—నాకేల. మాఅబ్బాయికి చెబుదువుగాని లే. నేనే అప్పులరొంపిలోంచి బయటపడేమార్గం ఆలోచించాలిముందు.

గు—అతనురాగానే, నీమనస్సులో బాధిస్తూవున్నటువంటి ఉప్పుయెరువు భోగట్టా అడిగేస్తాను. దానికి సంజాయిషీ విన్నాక, నీకే తెలుస్తుంది అతని గొప్పదనం.

త—చూద్దాంగా - ఏంచెబుతాడోనూ...ఏదో కుడికన్ను అదురుతూంది. దానివల్ల లాభంవస్తుందని, పంచాంగ చూసి శంకరశాస్త్రుల్లు చెప్పేడు, అల్లవేళ.

గు—చూడ్డం యేమిటి, కనబడడంలేదూ? ఆయన మేలు నేను మరవలేను. వడ్లకు ధరలు లేవనిన్నీ, చెరకుల్లో ఉన్నలాభమూ, పత్తిలోవున్న లాభమున్నూ, మరేపంటలోనూ లేదని చెప్పి, వాట్లలో మంచిరకాలవి తెప్పించి, నాచేత వేయించేడు, పాపం - నాదెగ్గిర దమ్మిడీ పుచ్చుకోలేదు సుమీ. నువ్వు నమ్ముతేనమ్ము నమ్మకపోతేపో. తనిఖీ చేయించి మనభూమి చెరుక్కి మహాఅదునుగా ఉందని బంగారుతీగలు [చెరుకు] వేయించేడు; ఆమెరకని బాడవలో కాంబోడియా రెండవనంబరుపత్తివేసేం. ఆమదపుపిండి దొరక్క పోవడంచేత వేరుసెనగపిండి కొనమన్నాడు. అంతకుముందే మందమశాగత్తులు దిట్టంగా చెయ్యడంచేత, ఓ - ఓ - మనం పొగడకూడదుగాని నీకుగనక; మనవాడివని చెబుతున్నా—

చెమ్మెత్తుపోడుగునా, యెదిగింది చెరుకు- తోటనిండా వెన్న ముద్దల్లాగ విరగపండింది పత్తి.

త.—అదృష్టంఅంటే నీదేనోయ్.

గు.—ఇంకా విను. చెరుకులు కొయ్యడానికి కూలిపెట్టే ననుకున్నా వాయేమిటి? పేరీకంపెనీవాళ్లు భూమిమీంచి అలాగే కొనేసుకోని, డబ్బు, ముందుగా మరీఇచ్చేసి, వాళ్లే కోసుకొని పోయేరు. పత్తికి ముందుగానే ధర యేర్పాటుచేసుకొని బిన్నీకంపినీవాళ్లకి ఏరీ యేరడంతోనే పంపించేశాను. ఈవచ్చిన లాభంపెట్టి నీళ్లుతోడడానికి ఇంజను కొనుక్కో-వాలనివుంది. దానినిగురించి వాళ్ల పెద్దపంతుల్నికూడా సలహాచేసిచెబుతా డట, గోపరాజు.

త.—ఆబా బాస్తాడా రాడా చెబుదూ, ముందూ.

గు.—వోస్తాడుగానీ, నాకు లాబం వోస్తుందంటే మీా రెవరైనా నమ్మేరా?

త.—పోనిస్తూ...అయిపోయినదాని కేడుస్తే యేం లాభం? గనక ఇప్పటికైనా ఆబాబుకాళ్లట్టుకుంటా. నేను కూడాను. ఏదో తోవ చూపిస్తాడేమో, నువ్వన్నట్టే. [ప్రక్క-కుతిరిగి] అదిగో, చూడు, పోలయ్యమడి గట్టుమీాద నించివోస్తున్నా యనేనా యేమిటి?

గు—[పరకాయించిచూచి] ఆఁ. అతడేనూ...ఆయన దెగ్గిర అష్టేసేపు నాదవెళ్లబొయ్యాక, మఁడిమాటలు నాలుగూ చెప్పం.

త—ముందుగా నువ్వే అడుగు. ఆ తెల్లగా, పంచదారలాంటి యెరువు ఎందుకు మాడిచేసిందో, చేలని?

గు—సరే.

[ప్రవేశము : గోపరాజు]

గు—దండాలండి, బాబు.

త—దండాలండి, బాబు, నేను తమరికి కొత్త.

గో—[అందుకొని] బాగున్నారా? ... విన్నావోయ్ గురప్పా! ఈ ఘోరవార్త. సుబ్బిశెట్టి ఋణం తీర్చుకోలేక పోవడంచేత దావా పడేశాడు, ఆకోమటి మన పాపయ్యమీద. కోర్టువారు రేపు వేలాంవేసేస్తారట వాడి పొలాలు. పాపం. చిలక్కి చెప్పినట్టు చెప్పేనుసుమీ వాడితోటి, "వొద్దు, వొద్దు శెట్టిదగ్గిర తేకు చెడిపోతావు నిష్కారణంగాను. సహకారపు బేంకులో తెచ్చుకో, తక్కువవడ్డీకే యిస్తా" రలాగని. అంతకన్న నేనేంజెయ్యాను? ఎవరికర్మమునకు ఎవరు కర్తలు?

పోనీ దానిమాటకేం గాని, ఇతన్ని ఎక్కడో చూసినట్టుంది. ఎక్కడ చెప్మా (అని యోచించుచుండును.)

గు—ఆనాడు మీరు లచ్చిందేవికథ చెప్పడానికి సః చేసేరే, దానికి ఎలాగై తేనేం, తాళ్లూ, మోకులూ పెట్టి ఈడుచుకొచ్చేను. కొత్తవ్యవసాయమంటే వీళ్లజట్టుకునచ్చదు. దాని కొహాకారణం ఏమిటంటే, ఎవరో ఒకనాడుఒకపంతులు తెల్లని ఉప్పులాంటి యెరువు తెచ్చివేస్తే మంచిదని చెప్పగా అలాగ వేసేడట, ఇతిగాడు. చేలుపచ్చగా కనబడ్డట్టే వుండి, తరవాత పాడైనాయట.

గో—అందులో పాపం, ఇతని తప్పేదీ? అలాగ ఒక మాటు దెబ్బతింటే, నమ్మకం మరి దేనిలోనూ ఉండదు. వీళ్లలో ఎవరికైనా నచ్చచెప్పేబాధ్యత మనదే గనక, భూసారం మీాద చిన్నపాట ఉంది. వినండి.

త—తప్పకుండానూ, బాబూ, సెలవియ్యండి.

గో—

పాట : (గురప్పపాటమట్టుమీాదనే)

భూములసారము పోకుండగ నది
హెచ్చగుమార్గం బేదీ ?
పసగలయెరువే ప్రాణమునేలకు ;
పంటకు నిచ్చును పటిమగ. భూముల.

ఏయేయెరువులో ఎంతశక్తి గల
దో శోధింపగ, దోచున్

ప్రాణముగలయా పశువులయెరువా,
గానుగపిండియు ఘనముా
ఉత్తమమే యే చెత్తచెదారము
సచ్చియాకులను వాడన్
ఎముకలపొడియూ, వేసినమంచిది
ఏచేలైనను, పెంచున్. భూముల.

రసాయనికముల్ రకాలకొలదీ
మధ్యమ మగుటంబట్టీ
సమయోచితముగ సలహానందుచు
కొంచెమె* వేసిన గుణముా. భూముల.

ఏ మెరువైనను యెన్నడు వేయుట
మానినచో కడు హానీ
పంటల నష్టము పటిమయుబోవుట
లేమియు కనబడలేదా ?
తోచినయెరువులు తోచినట్లు వే
యంగ రాగలదు భంగం
రసాయనికశాస్త్రజ్ఞు నడిగినా
ఊరక సలహా చేరున్. భూముల.

---

* చేర్చిన [అని పాఠాంతరము.] అనగా మిగిలిన పెంటకు చేర్చిన యెరువుల.

విన్నావా తమ్మయ్యా? నువ్వువేసినది ఒక ఘాటైన రసాయనికయెరువు గనక వేడిచేసిపోయింది, ఎక్కువ ఉపయోగించడంవల్ల. మనది కాక [ఉష్ణ] దేశంగనక చలవచేసేటటువంటిన్నీ, ప్రాణముగలిగినటువంటిన్నీ పెంటలూ, చెత్తలూ చేర్చవలసివుంది, మనభూములికి. అటుపైని అంతకూ వెయ్యాలని ఉంటే, మాద్వారా కోయంబత్తూరు శాస్త్రుల్లకు రాసి కనుక్కోవాలి, ఆయెరువు మనభూములకి పనికొస్తుందో పనికి రాదో అని. వాళ్లసలహా పుచ్చుకున్నావే స్తే ఫరవాలేదు.

త—బాబ్బాబు! మీరు దేముడులాగున్నారు. మీ పాదాలట్టుకుంటే నాపాపాలు పోతాయి [అని కాళ్లమీద పడును.]

గో—[తమ్మయ్యను లేవదీసి] ఏమిటోయ్, అంత అజ్ఞానం. నేనెవర్ని మనుష్యమాత్రుణ్ణేకదా?

త—[కంటతడిపెట్టుకొని] బాబూ, చెప్పుకుంటే సిగ్గు; దుఃఖం భరించలేకుండా ఉన్నాను. ఎలాగైనా మీరు రచ్చించాలి, మీకన్న నాకు దేముడు లేడు.

గో—నీకు నేను చెప్పిన భోగట్టా బోధపడిందా లేదా?

త—బోధపడకేమండి బాబూ; ఇంకా శానాచిక్కులున్నాయి నా వ్యవహారాల్లో. అవెలాగైతేనేం తమరే విడదీసి, రచ్చించి, పుణ్యం కట్టుకోవాలి.

గో—వ్యవసాయానికి సంబంధించినదైతే, నాకు చేతనైనటువంటి సాయం చేయగలను.

త—మా తాత ముత్తాతలకాలం మొనగాడండి. మేము ఎనమండుగు రన్నదమ్ములం. ఇప్పటికి నేనొక్కణ్ణేమిగిలేను. వేరైపోయినదగ్గిర్నుంచీ ఎవరిమట్టుకు వాళ్ళే అప్పులపాలైపోయి చెడిపోనాంబాబూ ఇలాగ-ఆకోమిటోళ్ల సిగాతరగా.

గో—అవును మరి. నివేశనాలు తగ్గినకొద్దీ, లాభాలు తగ్గకమానవు. తరవాత, కోమిటాడి చేతులో పడ్డవాడూ, గోతులో పడ్డవాడూ ఒకటే.

త—మా బాగా శెలవిచ్చేరు బాబు; మాకు గతిఇంక లేదా ఏంటి ?

గో—లేకపోవడవేం. మన గవర్నమెంటువారి సంగతి మీకుపూర్తిగా తెలియదు. కాస్తఎక్కువప్రపంచజ్ఞానంఉంటే నేను చెప్పక్కరలేదుగాని ఇప్పుడు కొత్తగా "భూమి తనఖా బ్యాంకుల"ని స్థాపించేరు. అందులో మీలాంటివారికి వేలకు వేలు తక్కువవడ్డీమీద అనగా ౮, ౯ అణాలకి అప్పు ఇవ్వడమే కాకుండా, చిన్నచిన్న వాయిదాలమీద కొన్ని సంవత్సరాలపొడుగున తీర్చుకోనిస్తారు.

గు—[త. తో] మరైతే ఇంకేంవోయ్. సంపాదించు అలాగు.

త—(గో. తో) మరేదో మాకంతా అజ్ఞానం బాబు; తమరే తెప్పించి యిస్తే మాబుణం తీర్చుకోలేను.

గో—దానికేంగాని, నాతో వస్తే బాంకుకి తీసికెళ్లి, దస్తావేజు ఫారా లిప్పిస్తాను. ఆఉద్యోగస్థుడు నాకు విహితుడే గనక, అక్కడే పత్రం రాయించేసి, కరణంగారి దగ్గిర కెళ్లి భూములవిస్తీర్ణం వగైరాలు అందులో నింపుకొని, మిగిలిన రివాజులు నడిపిస్తాను. డబ్బు చేతికిప్పిస్తాను. ఎక్కువవడ్డీలతో ఉన్న బుణాలన్నీ తీర్చేసుకున్నావంటే, ప్రాణం కుదుట పడకమానదు.

త—మరేంబాబు; దేముడిలాగ సెలవిచ్చేరు.

గో— తరవాత కొత్త మోస్తర్లుగా లాభం వొచ్చే పైర్లు వేసుకొని అదున్నిబట్టి మంచిధర వొచ్చే పట్నానికి పంపించి అమ్మించుతే మంచికిట్టుబడి ఉండకపోదు. మన గురప్ప చూడు, మొదట ఇరవైయెకరాలు సాగు చేసుకొని ఇప్పుడు యేభయిదాకా ఆర్జించి ఉంటాడు. ఈలాంటి కిటుకులు గ్రహించే. ఒహానూరు కళ్ళ జూడకమానడు.

గు—తమ దయ ఉండాలి గాని, మాకేం తక్కువ బాబూ!

గో—నాలోనేముందోయ్. సర్కారువారుమనకు చేస్తూవున్న ఉపకారాలు తెలుసుకోలేక, ఎవరుముందుగా దాన్ని

సూచిస్తే, వారినే గొప్పగా చూస్తారు మీరు. దావోయ్
తమ్మయ్యా, ఇప్పుడు వెళ్లుదామా? లేపో, ఎల్లుండో మెల్లిగా
సావకాశం చూసుకొని వస్తావా?

త—తమసెల వెలాగైతే అలాగే, బాబు. తమ
దాసుణ్ణి. మీకాళ్లట్టుకొని వొదల్ను. నాకొడుకుల్నికూడా
మీకు అప్పచెప్పేస్తాను. వాళ్లకు కొత్తమోస్తరు సాగుబడి
చెప్పించండి; చేయించండి. మీరెలాగ చెబితే అలాగ
నడుచుకుంటాం.

గో—అలాగే దాని కభ్యంతరంయేమీ? మనగురప్ప
ఉన్నాడే. కొత్తసాగులో కిటుకులు ఇతను బోధపరుచుకున్న
ట్టున్నా, వాటిని ఆచరణలో పెడుతున్నట్టున్నా, ఈప్రాం
తాన్ని యెవ్వరూ చెయ్యలేదోయ్; గనక మీఅబ్బాయిలని
వాళ్ల మామ్మూలుపనులు చేసుకున్నాక, గురప్పగారిపొలాలు,
తోటలూ జాగ్రత్తగాచూసి, అతనిదెగ్గిర తరిఫీదవమను.
అతనిదెగ్గిర నేర్చుకున్నా నాదెగ్గిర నేర్చుకున్నా ఒకటేను.

రెణ్ణాళ్లలో నేనువొచ్చి, మీభూములన్నీ తనిఖీచేసి,
ఏవసతులు కల్పించగలమో ఆలోచించి చెబతాను. అప్పుడే
నిన్ను దెగ్గిరుండి బేంకుకి తీసుకెళ్తాను తెలిసిందా.

త—చిత్తంబాబు, ఇవాళకి చమించాలి. సీకటిపడి
పోతుందా, మరి. గనక సెలవిప్పించండి; రాత్తిరైతే కన్నగ
పడదు.

[గురప్పతో] ఓయ్ గురప్పతమ్ముడూ! మా అబ్బాయిలని తెల్లార్తూనే ఒకమాటు నీదెగ్గిరకి పొమ్మంటాను. వాళ్లని యేంజెయ్యమంటావో, యేంజేయిస్తావో, యెలాగ బాగు చేస్తావో ఆబారం అంతా నీకీ, ఈబాబుగారిదిన్నీ. నేను పెద్దోణ్ణయేనా, మరి.

గు—అదెంతట్లోపనోయ్. ఇటుపైని నేనూ ఒహామాటు అవకాశమున్నప్పుడు నీదెగ్గిరికే వొస్తాను. ఏమైనా పెద్దోడివి గదా అందాకా వొస్తునా?

గో—[త. తో] మంచిది. నేనుకూడా కొంతదాకా వచ్చి, పెద్దగట్లు దాటించెస్తా ఉండు తమ్మయ్యా.

(గురప్పతో) తమ్మయ్యనీ, కొడుకుల్నీ చూస్తూ వుంటావుగా. నేనుకూడా వీలయినప్పుడు కనబడతాన్లే. అన్నట్టు గురప్పా, నీయింజను విషయమై పెద్దపంతుల్ని అడిగేను. పైకి కంపెనీలకి రాసేము. వాటి ధరలపట్టీలు, వాటి శక్తి సామర్థ్యాలు తెలిపే కేటలాగులు వచ్చేయి. మనకి పనికొచ్చేది తెప్పించుకుందాం. ఇంకొకనాడు ఆయన దెగ్గిరకి నిన్ను తీసుకెళ్తాను.

గు—చిత్తం. అంతతొందర లేదులెండి.

గో—అయితే వస్తాను నువ్వు ఉండిపో. (తమ్మయ్యతో) దావోయ్, తమ్మయ్యా.

గు—ఉంటాను తమ్మయ్యా. దండా లండి, పంతులు గారు.

గో—(అందుకొని) మంచిది.

(గోపరాజు, తిమ్మయ్య నిష్క్రమింతురు.)

గు— ఇహ తమ్మయ్య లేక బయలుపడ్డట్టే. మనం చెప్పినట్టు వినకనూ, చెప్పింది నమ్మకనూ, తనకి తోచినట్టూ చేసుకొని అప్పులపాలైపోయినాడు. పోనీ ఇప్పుడుబుద్ధొచ్చింది గనక బాగుపడతాడు. వాళ్ల పెద్దబ్బాయి మహాచురుకైనోడు. వాడి పనివాడితనం ఇంకోమారు చూసి వాడికి మా రెండో పిల్ల నివ్వాలని ఉంది. దాంతో మనకీ తమ్మయ్యకీ అభిమానాలు పెరుగుతాయి. ఇంకో రెణ్ణాళ్లు పోయేక అడిగిచూద్దాం. నేనంటే తోసెయ్యగలడా!

[తెర వ్రాలును.]

---

## ౨-వ రంగము

---

స్థానము : ఇల్లు

గోపరాజు—[కుర్చీమీద కూర్చుండి వ్రాసికొనుచు, వ్రాత ముగించి]

తనఖాబాంకులో సొమ్ము తెచ్చిన ముహూర్తాన్ని, తమ్మయ్య ఋణాలు తీరడమే కాకుండా వాడి పెద్దకొడుక్కి గురప్పగారిపిల్లనివ్వడం మూలాన్ని, వాళ్లూ వీళ్లూ ఉమ్మడి వ్యవసాయం మొదలెట్టేరు. వాళ్లు ముందుకు రావడంతో, ఈ వూళ్లోనేగాక చుట్టుపక్కల గ్రామాల్లోకూడా మన పలుకుబడి హెచ్చవుతుంది. శంకరశాస్త్రులుగారికి కూడా నేనంటే ప్రాణం. గనక అతని పలుకుబడి మూలంగా సహకారం, ఆరోగ్యం ఇలాంటి భోగట్టాలుకూడా గ్రామస్థులకి బోధపడుతున్నాయి మెల్లిమెల్లిగా. నిర్బంధ ప్రారంభవిద్యాచట్టము ఎంతవేగం అమలులోకి వస్తే అంతవేగం మన పని జరుగుతుంది మరింత నిరాఘాటంగా.

("గోపరాజుపంతులుగారూ" అను పిలుపు)

గో—దయచెయ్యండి, లోపలికి.

(ప్రవేశము-శంకరశాస్త్రి)

శం—నమస్కారం. గోపరాజు పంతులుగారూ!

గో—నమస్కారం. ఇలాగ దయచెయ్యండి (ఇంకొక కుర్చీ ఇచ్చును).

శం—(కూర్చొని) అయ్యా! పులిమీద పుట్ర అన్నట్టు ఇప్పుడు మాఇనస్పెక్టరుగారు ఏం ఆర్డరు వేసేరో చూసేరా? నాలుగోక్లాసుకుర్రాళ్లకి వ్యవసాయం గురించి కూడా కొంత

చెప్పవలసిం దని ఆజ్ఞ. ఏంజెప్పాలో నాకే గ్రాహ్యం కాలేదు. కర్రెక్ట్యులం లేందే యేం జెప్పను?

గో.—వ్యవసాయమనేది కుగ్రామాల్లో వుంటే మన లాంటివాళ్లకి కొత్తగాదు. ఏమంటారు?

శం.—బాగుంది. నేనూ పొలాల్లోకి ప్రొద్దున్నే పోయి, రయితువాళ్ల నడిగి వంకాయలో, మిరపకాయలో మజ్జిగ చుక్కో తెచ్చుకోవడమే కాని, శాస్త్రరీత్యా యేమీ కృషి చెయ్యలేదు. దాని కవకాశమూ లేదు. గనక తమరు ఏవో నాలుగుశ్లోకాలో, పద్యాలో, అథవా కీర్తనలో శెలవిచ్చే రంటే "వ్యవసాయంగురించి తెలియవలసింది ఇదేనర్రా" అని వాళ్లయర్థాన్నకొడతాను.

గో.—అయ్యా! క్షమించండి. వ్యవసాయశాస్త్రం అలాగ మొదట నాలుగుముక్కల్లో చెప్పవలిసిందీ కాదు; మరొకర్ని వల్లించమనవలిసిందీకాదు; వల్లించినా వచ్చేది కూడాకాదు. పూర్తిగా ఆశాస్త్రజ్ఞానం అలవడాలంటే, అథ మం ర, 5 శాస్త్రాలైనా అనగా, భూగర్భశాస్త్రమున్నూ, రసాయనశాస్త్రమున్నూ, వృక్షశాస్త్రమున్నూ, వ్యవసా యానుగుణ్యమైన కీటక శాస్త్రమున్ను, తెలుసుకోవలసి ఉన్నది. లేకపోతే, కృషివిధానం యొక్కరహస్యాలు బోధ పడవు; కొత్తమోస్తర్లు కనిపెట్టే శక్తిసామర్థ్యాలు రావు.

శం—కొంపతీసి, నన్ను ఈ ఇంగ్లీషు శాస్త్రాలన్నీ నేర్చుకొమ్మంటారా యేమిటి, మీరున్నూ మా ఇనస్పెక్టరు గారున్నూ. "అరవై యేండ్లొచ్చినోడికి చదువుకొనే మన్నుకొట్టుకుంటూనా అన్నాడట" ఎవడో అలాగ నాకేమిటీఖర్మం చెప్పండి. ఈతినే అన్నంకూడా ఒంటబట్టనియ్యరా యేమిటి చెప్మా.

గో—మీరలాగ ఆగ్రహిస్తే యెలాగు చెప్పండి? తమకి శాస్త్రంయొక్క ఘటిలత్వం తెలుస్తుంది, దాని తత్వం బోధపడుతుందిగదా అని దాన్నిగురించి చెప్పేనుగాని, కుర్రాళ్లకి చెప్పమంటామా? చెప్పినా బోధపడుతుందా? మీకు ఆవిషయమై శ్రమపడక్కరలేకుండా వాళ్లకి గ్రాహ్యమయే భోగట్టాలుమాత్రమే చెబుతాను, సావధానంగా ఆలోచించి.

ఇప్పటిమట్టుకు వారాని కొకపర్యాయం, శిష్యబృందాన్ని వెంటవేసుకొని, నాలుగుపొలాలూ చూపించి, ఆయారయితుల నడిగి, ఏయేకార్తిలో ఏయేచేలు ఎలాగ వేస్తారో వాటికి మందమశాగత్తు ఎలాగ చేస్తారో, ఎంతెంత యెరువులు వేస్తే, యెంతెంత ఫలసాయం వొస్తుందో, నిఖరమైనలాభా లెంతో క్రమంగా తెలియజెప్పండి. ఎంత అవకాశం అయితే అంతమట్టుకేచాలును. ముఖ్యంగా, గురప్పలాటి రైతుదెగ్గిర కొత్తగా అవలంబించే మార్గాలు తెలుసుకుంటే, కుర్రవాళ్లకు ఉత్తరత్రా పనికొస్తాయి.

శం—అదెంతట్లోపని; అయినా తమరుకూడా బహూ మాటు మాత్రో దయచేసి చూపిస్తే—శ్రమ అయితే వొద్దు సుమండీ—మీఋణం తీర్చుకోలేను.

గో—అలాగ అనడం ధర్మమా? మీ పని అంటే ఒకటీ, నాపనిఅంటే ఒకటీనా? తెల్లవారిలేస్తే రయితులతోనే గద నాకు ప్రసక్తి. నేను రేపు గ్రామాంతరం వెళ్లవలసి ఉంది. అక్కడ రెణ్ణాళ్లుండి వస్తాను. తర్వాత సకృచ్ఛంగా మాట్లాడుకొందాం.

శం— అయితే ఈ పులుసుతో ఈముద్ద దిగినట్టే. అన్నట్టు మరిచిపోయేను. మీరానాడు సభలో "సహకార సూత్రములు" గురించి చెప్పిన ఉపన్యాసం నకలుంటే తీసుకు రమ్మన్నారు కరణంగారు, పూర్తిగా అవగాహనం చేసుకుందికి. ముఖస్తుతికాదుగాని, అయ్యా, మీరు వచ్చినతర్వాతే మా గ్రామంలో కోఆపరేటివ్సొసైటీ లేవడం, అందువల్ల రైతులు బాగుపడడమున్నూ.

గో—ఇదుగో తీసికెళ్లండి. ఇంతకన్నానా. (అని బల్ల మీాది ఒకఉపన్యాసం అందిచ్చును.)

వచ్చేమాసంలో గ్రామపారిశుద్ధ్యమువిషయమై బడి పిల్లలకు చెప్పదగిన కొత్తవిషయాలు సూచిస్తూ ఒకచిన్నకథ రాస్తాను. అది పిల్లలకు మీారుచదివి బోధపరుస్తే సంతోషం.

మిగిలినపనితొందర్ల చేత గాని లేకపోతే ఈపాటికే రాసి యుండేవాణ్ని.

శం—తొందరేమిటి? తమకు అవకాశం ఉన్నప్పుడే రాయించండి. కర్రికుల్యలంలో ఇంతా లేదుగద. ఈలోగా, నాకు తెలిసినంతమట్టుకు సాయంత్రం బడి విడిచిపెట్టడానికి ముందు పావుగంట కూర్చోపెట్టి సహకారాన్ని గురించి మీ వ్యాసంలోంచి యేదో కొంత యేకరువుపెడుతూ ఉంటాను లెండి లోకజ్ఞానం కలగడానికి.

గో—తొందరంటే మరేమీ లేదు. తమ్మయ్య భూము లలోనిమన్ను తనిఖీకోసం కోయంబత్తూరు పంపించేము. ఆ విషయమై ఉత్తరప్రత్యుత్తరా లింకా జరగవలసి ఉన్నాయి. గురప్పకి నీళ్లు తోడుకొనే ఇంజను కొనిపెట్టాలి. త్వరలోనే ఒక వ్యవసాయప్రదర్శనంజరిగించే యేర్పాట్లు చేయించాలి. ఇవన్నీ అనుకున్నపళాన్నే జరిగే వ్యవహారాలు కావుచూడండి.

శం—మిమ్మల్ని ఒహ చిన్నభోగట్టా అడగా లని మనస్సు బాధిస్తూన్నది. మీరు కోప్పడనంటేనే అడుగుతా.

గో—తమరు అడగడమూ, నాకు కోపమున్నా, ధర్మ మూ అలాగనడం.

శం—తమరు అభయమిచ్చేరు గనక అడుగుతాను. మీ డిపార్టుమెంటువారు "ఒహో ఇన్నికోట్లు లాభంచేసేం,

ఇంకా ఇన్నిలక్షలు ఈ సంవత్సరం చూపించగలము." అంటూ పేపర్లలో వ్రాసేస్తారుగదా. ఏమో, ఏకామధేనువో కల్పవృక్షమో పునస్సృష్టిచేసినట్లు నాకేమీ తెలియలేదే. ఇది మనలో మనమాటలెండి, రహస్యం.

గో—ఈప్రశ్న తమరేగాదు, శాసనసభ్యులుకూడా అడుగుతూంటారు. సమాధానము చెప్పడం కష్టసాధ్యంకాదు. మాశాఖవారు కనిపెట్టిన కొత్తరకపు విత్తనములనువేసి, వారు చెప్పిన యెరువులను చాలినంత వాడుకొని ప్రతీరయితున్నూ—విన్నారా, ఒకడైనా తప్పకుండా, ప్రతీవ్యవసాయదారుడున్నూ—సరీగా సాగుచేసి పంటలను మంచిక్రయము వచ్చే బజారులలో అమ్మినయెడల మేమన్నంతకన్న ఎక్కువ లాభము రాకతప్పదని ఘంటాపథంగా చెప్పగలం గాని ఇది మహాపెద్ద హంసపాదులెండి—రయితులందరూ మాసలహాల నంగీకరించకపోవడంచేతనున్నూ, నీటిసౌకర్యములు సరియైనవి అదునుకు అందకపోవడంచేతనున్నూ అనుకున్నంత లాభం కనబడకపోవడంలో ఆశ్చర్యం లేదు. సలహాలు అంగీకరించక పోవడంలో కేవలం రయితులది తప్పుకాదు; వాళ్ల అజ్ఞానమే. అదీగాక వాళ్లప్రస్తుతదారిద్ర్యావస్థే వాళ్లకి శత్రువులవుతూన్నది. ఈలంపట విచ్ఛేదం అయితేనేగాని వాళ్లు బాగుపడడం కష్టసాధ్యం. ఈ విషయాల్ని గురించి చాలా చర్చించ

వొచ్చును. అవకాశాన్నిబట్టి నాకు తెలిసినంతమట్టుకు చెబుతూఉంటాను.

శం—చిత్తం. అదే మహాభాగ్యం. తమదెగ్గిర కూర్చుంటే యేవో కొత్తభోగట్టాలు తెలుస్తూనే వుంటాయి. తిరిగీ దర్శనం చేసుకుంటాను, ఇప్పటికి సెలవా.

గో—చిత్తం. నేను కొత్తపల్లె వెళ్లి తిరిగీ రెండు మూడురోజుల్లో వొస్తాను. ఉంటానండి, నమస్కారం.

శం—నమస్కారం. [శంకరశాస్త్రి నిష్క్రమించును]

గో—ఈవూళ్లో ప్రచారంవిషయమై ఏమీ చిక్కులేవుగాని, ఇహో, ఆవూళ్లో మల్లయ్య పొలాలు ఎంతవరకు బాగుచేయించగలమో చూడాలి, బొత్తిగా చౌడుబారినట్టున్నాయి. [తెర వ్రాలును]

---

## 3-వ రంగము

---

### స్థానము: పొలము

(తమ్మయ్య, పెద్దకొడుకున్ను, గడ్డిమేటు వేసుకుంటూ ఉందురు.)

తమ్మయ్య— పాట

హరిహరీనారాయ-ణాదినారాయణా-

కరుణించి మమ్మేలు-కమలలోచనుడా. హరి.

గోవులను గాచేటి - గోపాలకృష్ణుడా

పాడిపంటల నెల్ల-పాలింపుమయ్యా. హరి.

కరువుకాటకములూ-గాసింపకుండంగ

కాలమానము, గాయి - కంబుకంపుండ. హరి.

వ్యవసాయశాఖలో - వారినీ రక్షించు

వారు కాపాడుదురు-పైరులను మమ్ముగా. హరి.

అప్పుసొప్పులను మా-కిప్పించి తోడ్పడే

సహకారశాఖయూ - చల్లగుండాలి. హరి.

(కొడుకుతో) ఇయ్యరా, పెద్దోడా, ఇంకో బొద్దుగడ్డి.

కొడుకు— (ఒకబొద్దు అందిచ్చును.)

(ప్రవేశము - గురప్ప) ఏంహోయ్ తమ్మయ్య బావా, మహాజోరుగా విసురుతున్నావు పదం. కొత్తవసాయం మహిమ తెలిసిందా? ఇంకా చూడు, దాని తమషా.

(తమ్మయ్య కొడుకుతో) ఒరే నాకింకోటడయ్యేం.

(అని తానుకూడా గడ్డినందుకొని సహాయం చేస్తూ ఉండును.)

పాట (హరిహరీ నారాయణ—వరుస)

(తమ్మయ్యా, గురప్ప కలిసి పాడుదురు.)

గు—పంటలో నెక్కువా-ప్రాణ ముండాలంటె
ప్రాణ ముండేయెరువు-వాడాలికాదా?

త—పశువూలయెరువులో-ప్రాణ మెక్కూవాని
ఆదివిష్ణువు వచ్చి-ఆనాడు చెప్పే

గు—వ్యవసాయశాఖలో-పండితులు దీనికే
శాస్త్రానుకూలమా-సబబు కనుగొనిరీ

త—కుళ్లినచెత్తలో-కుళ్లుటాకూలందు
గానుగపిండిలో-గలదు ప్రాణంబూ

గు—ఎముకాల పొడిలోను-యేచేల కైనాను
పనికివచ్చే సత్తు-వునికి తెలియండీ.

గు, త—హరిహరీనారాయ-ణాదినారాయణా
కరుణించి మమ్మేలు-కమలలోచనుడ.

[ప్రవేశము శంకరశాస్త్రి] ఏంవోయ్, తమ్మయ్యనాయుడూ; ఏం గురప్పనాయుడూ నువ్వూ ఇక్కడే తటస్థించేవూ. బాగుంది ఇద్దరూ పాటలు దంచేస్తున్నారు. ఉమ్మడి వ్యవసాయమా, యేమిటిది ?

తమ్మయ్య; గురప్ప:—దండాలండి.

శం.—మహదైశ్వర్య ప్రాప్తి రస్తు. తమ్మయ్యా, వీడు మీ పెద్దబ్బాయి కాదూ? వీడికేనా పెళ్లి చేసేవట? మహావైభవంగా జరిపించేవట. ఇనస్పెక్షన్ హడావిడిలో రాలేక పోయేను. పెళ్లికూతు రెవరేమిటి? జ్ఞాపకం రాకుండా వుంది, వృద్ధాప్యం కాదూ మరి?

త.—మరెవరేంటి, బాబూ. మాగురప్పగారమ్మాయే సిలకలాగుంది. గురప్పకీ నాకూ బేదంలే దింక. దండమెట్రా పెద్దోడా!

కొడుకు.—(దండం పెట్టుచు) దండాలండి!

శం.—శీఘ్రమేవ సుపుత్రప్రాప్తిరస్తు; పెద్దాడివయే వుట్రా. శిష్యా గురుకట్నం ముట్టలేదులే ఇంకా.

త.—(శం. తో) బాబూ, మళ్లా యిలాగ మనబావుటా యెగురుతుం దని కల్లోఅయినా అనుకోలేదుసుమండీ.

శం.—(చిరునవ్వుతో) అంతా యథోక్తంగానే వుంది. ఒక్క మాటుండు (అని, పొడుంచేతులో వేసుకొని, తమ్మయ్య గురప్పగార్లకు అందిచ్చి, కొడుక్కి చూపించి, ఒకపట్టు నిదానంగా పీల్చుకొని, ఇంకొకపట్టులాగి, పొడుంకాయ మొలలో పెట్టుకొనును.) ఆ: తి-తు-తే-తో-తమ్మయ్యా నీనామనక్షత్రం విశాఖ-అంటే జన్మకాల గురుమహాదశాసంవత్సరాలు పదహా రన్నమాట. "జీవమందజ్ఞకేతుః" అని ౧౬ ఏళ్లు

వెళ్లేసరికి కేతువు సమాప్తం అయిపోయిందికదా. ప్రస్తుతం శుక్రమహాదశా సంవత్సరాలు ఇరవైయిన్నీ అఖండైశ్వర్యాం ఇవ్వకపోతే నన్ను మారుపేరుపెట్టి పిలువు.

గు—(తనలో) ఇప్పుడే అంటూన్నారు. శంకరశాస్త్రుల్లు వొంకరశాస్త్రులూ అని.

శం—అదీగాక, ఈమధ్య యేలినాడిశనిరోజులు. ఎవరికైనా దానా లిచ్చెయ్యలేకపోయినావ్రా? పోనీ, దానిశిగా తరగా. ఇప్పుడు గురుడు ఏకాదశాని కొచ్చేడు గనక ఇహ నీనెత్తిమీాది పువ్వు తీసేవాడు లేడోయ్.

త—చిత్తం, బాబు, మీాఆశీర్వచనంవల్ల బాగున్నాం.

(కొడుకుతో) ఒరే పెద్దోడా ఒహాలేతకొబ్బరిబొండాం తీసుకురా, ఆచిన్న చెట్టెక్కి.

శం—ఆదోవనే, ముదరవికూడా రెండు తే; పచ్చడికి అభిషేకానికీ పనికొస్తాయి. (కొడుకు నిష్క్రమించును.)

(తమ్మయ్యతో) దానికేం గాని.

తమ్మయ్యా, ఇప్పుడు సద్యః సస్యా లెలా గున్నాయి? కుఱ్ఱాళ్లుకూడా జోరుగా పనిచేస్తూన్నట్టుంది.

త—ఏదో బాబూ; చెప్పేనుకానండీ. గురప్పకీ నాకూ బేదంలేదని. అంచేత అతడే అంతా చేయిస్తున్నాడు. ఉమ్మడి వ్యవసాయం, వ్యవహారమున్నూ.

(గురప్పతో) ఏంవాఁయ్ ఊఁ అను.

గు—మరేముండి బాబు. గోపరాజు కటాక్షం, అంతాను.

శం—ఓహోహో! ఏం దివ్యమైన ప్రచారకుడోయ్ ఆయన.

త—ఆయనుండబట్టే మేము బతికేం బాబూ. పెద్దోడు చెరుకు లేసేడు; చిన్నోడు కాంబోడి పత్తంట, అదేశాడు. బుచ్చోడు వేరుసెనగ లేశాడు. ఈమూడుపంటలలోనూ వున్న లాబం మరిదేన్లోనూ లేదన్నా డాప్రబువు గోపరాజు. వాటి కంతా యెరువు, పెంటా, చెత్తా, ఎమికలు, సత్తువ కొలదీ గానుగపిండి వేసేం ఏదో బగవంతుడి కటాచ్చం, మీ ఆశీర్వాచనం.

శం—మీ యిద్దరివల్లా ఒహ ఘనకార్యం కావలసొచ్చేను. గురప్ప పొలానికెళ్తే ఇక్కడున్నాడని చెప్పేరు. 'ఏకక్రియాత్ ద్వ్యర్థకరీబభూవ' అన్నట్టు ఇద్దర్నీ ఒహామాటే చూడ్డం అయింది.

మరేంలేదు. వచ్చే వైశాఖమాసంలో శుక్లపక్ష త్రయోదశీ శుక్రవారం మిధునలగ్నమందు మాకుర్రదాన్ని నరసింహావధానులుగా రబ్బాయి కిచ్చి రామతీర్థాల్లో వివాహం చెయ్యడానికి పెద్దలు నిశ్చయించేరు. ఈ కార్యం తల

పెట్టుకోవడం, మీలాంటి భూమికామందులను నమ్ముకొనే సుమా. లేదనకుండా మీ ఇద్దరివంతుకి చెరి రెండేసిబస్తాల బియ్యం. అంతకంటె నాకు ఆశ లేదు. ఇప్పుడే మీరు కల్యాణోత్సవం జరిపించేరా, కష్టసుఖాలు మీకే తెలుసు.

గు—(తమ్మయ్యచెవిలో ఊది) చెరొకబస్తా వేసుకొండి.

త—అలా చేసుకొండి.

శం—సరే, అదెంతగాదు. 'యథాప్రాప్తం'అన్నాడు. రైలువేళైపోతుంది వెళ్లొస్తునా? అన్నట్టు, కుర్రాడింకా రాలేదేం?

త—అదుగో, బేగొస్తూరా.

(ప్రవేశము కొడుకు, కొబ్బరిబొండంతో)

శం—ఏంరా, కాయలు తేలేదూ?

గు—తర్వాత ఇంటికి పంపిస్తాడులెండి, ఇది తాగండి.

శం—ఇక్కడ తాగేస్తే కుర్రాళ్లేడుస్తారు; ఇంటికి పుచ్చుకుపోతా ఇలాతే. (పుచ్చుకొని, పొడుం పీల్చుకొనును). వస్తునా ?

గురప్ప, తమ్మయ్య, కొడుకు—దండాలండి.

శం—దీర్ఘాయుష్యమస్తు (తనలో) ఇహ సగంకార్యం అయినట్టే. గానిపుస్తెముడిపడేదాకా బెంగే. (నిష్క్రమించును)

గు—చూసేవోయ్, తమ్మయ్యా బావా! బాపనా డెలాగ బతుకొస్తున్నాడోనూ? ముసిలాడుగాని, మహాఓపిక. అన్నట్టు మరిచేను. గోపరాజు నీతో చెప్పమన్నాడు. ఇప్పుడు వాళ్ల పెద్దపంతుల్ని తీసుకొస్తాడట, ఇక్కడికే. నన్నుకూడా ఉండమన్నాడు. ఇంజను కొనమంటాడేమో అడుగుదాం.

త—ఆగొడవేదో నువ్వు చూసుకుందూ. ఆపంతులు ఇతనికన్నా యెక్కువ చదివేడు కాబోలు!

గు—ఓ, యెంత గొప్పోడనుకున్నావు; ఆపెద్దపంతులు, బలరామ్మూర్తిగారని, మెస్టు, ఎఫ్. ఏ., బియ్యేకూడా చదివి, వ్యవసాయంపట్టా పుచ్చుకున్నాడు. మన రాజధానిలో అన్ని జిల్లాల్లోనూ పనిచేసి, చాలామందిని మనలాటోళ్లని బాగు చేసి, ఏండబ్బు గడించే డనుకున్నావు?

త—ఆయన కేమిస్తారో, జీతం?

గు—ఒహ వెయ్యి తీసుకొచ్చి, నెలాతిరిగేసరికి, కాళ్ల మీద కుమ్మరిస్తారంట!

త—ఓయ్ నాయనోయ్! మహా గొప్పప్రబు వన్న మాట. అత నింకా యేం జెప్తాడో చూతాం. గురప్పా అతనొస్తే నాకు బయం. అంతా నువ్వే మాట్లాడుసుమా.

గు—బయ మేంటోస్. కొడతాడా యేమిటి ?

(ప్రవేశము ; బలరామమూర్తి పంతులుగారు, గోప రాజు, బంట్రోతు.)

గో—ఇదుగో, ఇతడేనండి తమ్మయ్య. మనం దార్లో వస్తూచూసిన చెరుకుతోట ఇతనిదేనండి. గురప్ప, ఈయన ఇప్పుడు ఉమ్మడి వ్యవసాయం ప్రారంభించడంవల్ల చెరుకు తోట విస్తీర్ణం బాగా హెచ్చయినది. గనక నేను అక్కడ నూతిదగ్గర మనవిచేసినట్టు, ఒకనూనె ఇంజను కొంటానం టున్నాడు.

త, గు—దండాలండి బాబుగారు.

బల—(అందుకొని) ఏం, తమ్మయ్యనాయుడూ, ఇప్పు డైనా మేము చూపించే క్రొత్త పద్ధతులమీద నమ్మకము కలిగిందా?

త—మరేమండి, బాబుగారు. మీకటాచ్చం వల్లా, గోపరాజుగారి దయవల్లా బతికి బయటపడి కాస్త డబ్బంటూ కళ్లజూస్తున్నా. ముందే మీకాళ్లట్టుకుంటే ఇంతహింస పడక పొయ్యేవాణ్ణే.

బల—సరే, గతజలసేతుబంధనం యేల? ఇప్పుడు మీ రిద్దరున్ను ఏకీభవించి, చురుకుగా సాగుకిటుకులు గహించి, లాభం పొందుతున్నా రని విని చాలా సంతోషిస్తున్నాను.

గు—తమదయ ఉండాలిగాని, మాకేం లోటు బాబు గారూ.

బల—నీవు కోరిన సలహాను గురించి, ఆలోచించి నాను. వసతు లన్నీ బాగున్నవి. జలం సమృద్ధిగా ఉన్నది నూతిలో. తోటవ్యవసాయమునకు తగినవిస్తీర్ణము బాగున్నది. అయితే, ఇంజను నీయంతట నీవే నడుపుకుందికి కొంత తరి ఫీదు కావలసియున్నది. నీవు స్వయంగా పట్నం వెళ్లి ఇంజనీ యరింగుకంపెనీలో దాని సంగతి అనగా, దానిని నడిపించే మార్గములు నేర్చుకుంటావా? లేక కంపెనీ డ్రైవరును కొన్నాళ్లవరకు ఉంచుకొని మెల్లిగా ఇక్కడే నువ్వే నేర్చు కుంటావా? ఆలోచించి నాకు గోపరాజుగారిద్వారా తెలియ జెయ్యి.

గు—చిత్తం బాబుగారు, తమసెల వెలాగైతేఅలాగే. గాని ఇంజినుకు సొమ్ము వాయిదాలలో కట్టుకొనే యేర్పాటు చేసిపెట్ట మని ప్రార్థిస్తున్నాను.

బల—కంపెనీవారి నడిగి తప్పకుండా సాధ్యమైనంత వరకు ఏర్పాట్లు చేస్తాను. దాని కేమి గాని తమ్మయ్యా, గురప్పా మీా కింకొకసూచన కూడా చేయా లని ఉన్నది. గోపరాజుగారు చెప్పేఉంటారు మీాతో. ఇక రెండుమాసము లలో, (అనగా కొత్తమాంవాస్యకు) మన గ్రామములో ఒక

వ్యవసాయప్రదర్శనము స్థాపించి, డైరెక్టరువారినికూడా ఆహ్వా నించాలని నిశ్చయించుకున్నాను. చుట్టుపక్కల రయితులంద రున్నూ వచ్చి కొత్తవిషయాలు నేర్చుకోవడమునకు అవకా శము లెక్కువగా ఉంటాయి. మన నాలుగుజిల్లాలలోనుపండే పంట లన్నింటినీ, రకములవారీగా చూపవలసి యుంటుంది. గనక మీభూములలోవి నమూనాలు జాగ్రత్తచేయం డని స్వయముగా హెచ్చరిస్తున్నాను. ప్రదర్శనముజయప్రదముగా చేయుటకు మీరు సహాయపడాలి.

గు—తమరు సెలవిస్తే, దానిలో తిరుగుంటుందా బాబుగారు! తప్పకుండా తమమాటమీద నడుచుకుంటాము.

త—మరేమండి, మాగురప్పతో పాటే నేనూ నండి అయ్యా.

బల—(గోపరాజుతో) అయ్యా, మనము ప్రదర్శనపు మోటారులను ఇక్కడకు రప్పించి నూతనాంశము లేమైనను కనిపెట్టినయెడల వాని తబిశీళ్లు పంపమని కోయంబత్తూరు వ్రాదాము. కొత్తప్రదర్శనాపటములు తయారగుతున్నవా?

గో—చిత్తం. తమ సెలవుప్రకారం జరుగుతున్నవి, పను లన్నీ.

బల—నేను వెళ్లవలసి ఉన్నది పట్నం, ఈ రగం టలరైలులో. మీరు ఇప్పుడు నాతో రానక్కరలేదు. ఇక్క

డనేయుండి, వారి ఇంజిను ఉంచుటకు కట్టవలసినగదికి కావలసిన సామగ్రులు, వారికెరుకపరచండి. వారినిశ్చితాభిప్రాయము నాకు తెలియజేయండి, సావకాశము చూసుకొని.

గో—తమరిని దిగబెడుదామనుకున్నాను గాని, తమ ఆజ్ఞానసారముగా ఇక్కడనేయుందును; నాకుసెలవా? నమస్కారములు.

తమ్మయ్యా, గురప్ప—దండాలండి, బాబుగారు. (అని కూడా వెళ్లబోదురు.)

బల—ఉండండోయ్. నాకేమీ లాంఛనాలక్కరలేదు.

(బలరామమూర్తిగారు, బంట్రోతు నిష్క్రమింతురు)

గో—విన్నారా, పెద్దపంతులుగారి ఉద్దేశాలు. ఇంజిను గదికిప్లానువ్రాసి,అందుకయేసామ్మగురించిరేపుతెలియజేస్తాను.

గు—తమరింతొందుందంటే, అంతా పెట్టుకుంటాము మనవూళ్లో మనమే మొదటి ఇంజను పెట్టాలి.

గో—సరే, గాని, పెద్దడైరెక్టరుగారీ వూరొచ్చిరా ; కోటలో పాగా వేసేమన్నమాటే.

త—బాబూ,మీరుండగా,మాకేంకొదవ?వెయ్యేళ్లకీ. మీరు, మీడిపార్టువాళ్లందరూ,సల్లగుండాలి,దేముడిదయవల్ల.

గో—మాలో నేముందోయ్, నీఅజ్ఞానంగాని. మన రయితులు నలుగురూ కలిసి పూనుకుంటే. మనము సాధించ

లేనటువంటిపనే లేదన్నమాట. ఈలాటి ప్రదర్శనాలు అనగా ఎంత? కాని, మీారు నలుగురున్నూ నడుము కట్టుకోకపోతే మాడీపాస్టుమెంటున్నూ, మిగిలిన ప్రజోపకారశాఖలైనటువంటి సహకార, ఆరోగ్యశాఖను ఎంతప్రచారము చేసిననూ ఏంప్రయోజన ముంటుందో చెప్పు. గనుక మనరైతాంగమునకందరికీ జయమగుగాక! తద్వారా హిందూదేశం సకలసంపదలతోనూ వర్ధిల్లుగాక!

అందరు——  (మంగళం-పాట)

మంగళంబు-మంగళమూ-మంగళ మనరే.
మంగళము, రై-తాంగమున క-భంగురంబుగా. మం.
కాలమానము-కాల్వనీరు-గ్రాలుచుండగా
పాడిపంటలు-వన్నెగల్గి-వరలుగావుతక.
మిరపతోటలు-చెరుకుతోట-లరటితోటలూ
ప్రత్తిచేలు-పణముగూర్చు-పంటలు పండుక.
శాస్త్రిలు కృషి-శాఖవారు-సంపదలను, వర్ధిల్లజేతురు-దిట్టరులై-తీక్షణంబుగా.
కాపులెల్ల-కలసిమెలసి-ఖ్యాతిగాంచగా
దేశమంత-దివ్యమైన-తేజమొందునూ.
చెల్లువుమీార-చివిక్లిక్రిష్ణ-చేల, పశువులక
గావుమయ్య-కరుణతోడ-సకలముమాడ్పిదే. మం.

తెర ప్రాలుగు విశ్వవిద్యాలం.